AAL02D220
C

విశ్వసాహిత్యమాల : 42





జగన్మోహ



# లెనిన్ జీవితకథలు

Rs. 1/

AAL02D220

H = 7-1
ω=4-8

విశ్వసాహిత్యమాల 42.

# లెనిన్ జీవితకధలు

జగన్మోహన్.



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

I

ప్రథమముద్రణకు పీఠిక.

# పిల్లలకో మాట

ఈపుస్తకం మీకోసమే తయారుచేసేం. ఇది చదివి, మీరేమనుకుంటూన్నారో వ్రాయండేం, మరిచిపోక, మీకోసం వ్రాసిన పుస్తకం, మీకు పనికివస్తూందో, లేదో, నేను తెలుసుకోవద్దూ? మీరు యిటువంటి పుస్తకాలకోసం వుత్సాహపడతారని తెలుసు. అందుకనే యికనుంచైనా మీకోసం ప్రత్యేకంగా చిన్నపుస్తకాలు తెస్తాం, వీలైనంతవరకూ బొమ్మలతో.

మనందరి అభివృద్ధికోసం తమ జీవితాలను అంకితంచేసిన మహనీయులెందరో వున్నారు. వాళ్లందరినీగూర్చి మీకు చెప్పడానికి వస్తుంటాయి, పుస్తకాలు.

మన తెలుగుభాషలో బిడ్డలకోసం పుస్తకాలు తక్కువ. పిల్లల్నిగూర్చి, అత్యంత శ్రద్ధవహించిన దేశం,—యిప్పటికీ ఒక్కటేవుంది. అదే సోవియటు రష్యా. అటువంటి సోవియటును స్థాపించి, వృద్ధిచేసిన మహాత్ముడు లెనిన్. ఆయన మనందరికీ పూజనీయుడు. ఆయనలోని మంచిగుణాలూ, మంచిభావాలూ మీరుకూడా అలవరచుకుంటే, మన మాతృదేశం మళ్లీ ప్రపంచంలో మొదటి స్థానాన్ని సంపాదించగలదు.

లెనిన్‌కి బిడ్డలులేరు. మనపూర్వు లేమన్నారో తెలుసా? "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం." ఉదారచరితులకి విశ్వమంతా వారి కుటుంబమేనని దీనికర్థం. తథాస్తు. మనందరమూ మహాత్ముడైన లెనిన్‌కి బిడ్డలవంటివాళ్లమే, మరి. మీ బాలసంఘం అంతాచేరి, ఈ పుస్తకం చదివి, మాకు తెలుపుతారు కదూ?

1947 ఫిబ్రవరి 15,
రాజమండ్రి.

మహీధర జగన్మోహన్.
సంపాదకుడు.

# విషయసూచిక

# పీ ఠి క.

మానవజాతిలో యెందరెందరో మహాత్ములు, మహావిజ్ఞానులూ బైలుదేరుతూ వచ్చేరు.

ఆయాదేశాల్లోని, కాలాల్లోని భౌతికపరిస్థితులనుంచే యీ మహాత్ములు బైలుదేరి, తమ ప్రజలకు మార్గదర్శకులవుతూ వచ్చేరనేది నేడు అంతా అంగీకరిస్తూన్నదే. ఐతే గతచరిత్ర అంతా వింతలూ విడ్డూరాలూ, అలౌకికవిషయాలూ, మాహాత్మ్యలూతో నిండివుండి యదార్థాలను యేరి తీయడం కష్టసాధ్యంగా వుంటూంది. అందుచేతనే వారివారి కాలాల్లో మామూలు మానవులుగావుంటూ సమాజాన్ని మార్చేందుకు కృషిచేసి, సఫలులైనవాళ్లెందరినో దైవాంశసంభూతులుగా పరిగణించడం, వాళ్ల యధార్థజీవితం చుట్టూ యేవేవో అసంభవవిషయాల్ని అల్లిబిల్లిగా అల్లుకుని అసలుసంఘటనల్ని గానరాకండా చేయడం జరుగుతూవచ్చింది.

విదేశసాహిత్యాలలో మహాపురుషుల జీవితచరిత్రలు యెన్నెన్నో బైలుదేరినాయి. జీవితచరిత్రలు విజ్ఞానంలో ప్రధానశాఖల్లో ఒకటి అయింది కూడాను. భావిపౌరులైన నేటి బిడ్డల మనస్సులపైన యీ చరిత్రలకు యెంతో ప్రభావం వుంటుంది. ఈ విషయాన్నిగుర్తించే మనదేశంలో కూడా ప్రాచీనకాలాన్నుంచీ యెందరెందరో మహాత్ముల చరిత్రల్ని కవులు రచిస్తూ వచ్చేరు.

ఐతే చరిత్ర రచనా విధానాల్లోకూడా మార్పులెన్నో జరిగి, నేడు నూతన దృక్పథంతో గతచరిత్రలను చూడడం నేరుస్తున్నాడు, మానవుడు. తదనుగుణ్యంగా బిడ్డలమనస్తత్వానికి సరిపడేటట్లు అభ్యుదయ సాధకులైనవారి చరిత్రలను, వారిజీవిత విశేషాల్ని మనంకూడా సమకూర్చుకోవాలి.

శ్రీ

ఈ వుద్దేశ్యంతో 1947 లోనే యీపుస్తకాన్ని ప్రారంభించేము. కాని అప్పటినుంచీ జైలుకు మళ్ళీమళ్ళీ వెళ్లాల్సి రావడంతో యీ వరుసలో యింకోపుస్తకం వెలువర్చలేకపోయేం. చాలమంది కోరుతూండడంచేత దీనిని మరో కొంతవిషయాన్నీ, మరికొన్ని బొమ్మల్నీచేర్చి పునర్ముద్రించేము. లెనిన్ కుటుంబం, లెనిన్ మ్యూజియంకు సంబంధించిన 'అయిదు బ్లాకులనూ' యిచ్చినందులకై టాస్, సోవియట్ వార్తాసంస్థవారికి కృతజ్ఞులము. పుటలూ, బొమ్మలూ, ముద్రణావ్యయం పెరిగినా, తక్కువ కాపీలు వేస్తూన్నా పుస్తకం ఖరీదు మామూలే.

ఈమాదిరిలోనే "గోర్కీ జీవితకథలు" ముద్రిస్తూన్నాము. కేవలం స్వశక్తివల్లనే, స్వీయకృషివల్లనే ప్రపంచవిఖ్యాత మహాకవియైన గోర్కీ జీవితంలోనుంచి చిన్నపిల్లలు నేర్చుకోతగినవీ వారికి వుద్బోధకమైనవీ యెన్నోఘట్టాలు అందులో రమ్యంగా చిత్రించబడినాయి. పాఠకలోకం సహకరిస్తే యిట్టిమహాత్ముల జీవితాల నెన్నిటినో క్రమంగా ప్రకటించగలమని మా మనవి.

గ్రంథప్రచురణకార్యంలో యెన్నో కష్టనష్టాలకు గురియవుతూ ముందుకు సాగలేకుండా వున్న మాకు విరాళములనిచ్చి తోడ్పడుతూన్న మిత్రులకూ, భాషాభిమానులకూ కృతజ్ఞులము. శ్రీ గుత్తా మాణిక్యాలరావుగారు, ఏలూరు, రు 25/- లున్ను, శ్రీ విఠాల పురుషోత్తంగారు, నిడదవోలు, రు 100/- లున్ను విశ్వసాహిత్యమాలాభివృద్ధికై విరాళమొసగినందుకు వారికి మా ప్రత్యేక అభివందనము లర్పిస్తూయున్నాము.

భాషాభిమానులూ, అభ్యుదయకాంక్షులూ అభిమానిస్తేనే గాని యేకృషీ మననాట కొనసాగే దారిలేదు. గాన అట్టివారు ముందుకువచ్చి, సర్వవిధాలా తోడ్పడగోర్తాము.

రాజమండ్రి, మహీధర జగన్మోహనరావు,
30–4–1952. సంపాదకుడు.

మానవాభ్యుదయకాంక్షులై
నిరంతరం పీడితప్రజాసేవచేసే
మిత్రులు
కామ్రేడ్ పుచ్చల సత్యనారాయణగారికి
అభినందనపూర్వకంగా,

—లెనిన్‌కి బిడ్డలంటే ఎంతో ముద్దు.

"ఈబిడ్డల భవిష్యత్తు ఎంతో సుఖమయంగా వుండేటట్లు చేయడానికే మనంకృషిచేస్తున్నాం. వీరిసుఖశాంతులకై విద్యాభివృద్ధులకై మనం నేడుత్యాగంచేయాలి" అంటూం డేవాడు, లెనిన్.

—లెనిన్‌కి బిడ్డలులేరు. గాని, మనమంతా ఆయనబిడ్డలమే. మహాత్ములకు లోకమంతా కుటుంబమేగదూ!

—లెనిన్ చనిపోయేడు. కాని, మనజీవితాల్ని సౌఖ్యమయంగా చేసే సోవియట్ విధానాన్ని స్థాపించి మరీచనిపోయేడు.

—లెనిన్ మృతజీవి. ఆయన వారసులం, మనమందరమూ. ఆయనకు మనవంటిబిడ్డలు ప్రపంచంలో అన్నిదేశాల్లోనూ వున్నారు. ఇంకా మనం యెన్నోకష్టాలు పడుతున్నాం. కాని, లెనిన్ నిర్మించిపోయినగొప్పసంస్థఒకటి వుంది. అదే ప్రపంచానికి ఆశాజ్యోతి, అదేమిటో తెలుసా? చెప్పుకోండి, చూదాం!

# లెనిన్ కాలం

అనగనగా జార్ అనే చక్రవర్తి రష్యా అనే దేశాన్ని పరిపాలిస్తూండేవాడు. ఆయన నిరంకుశ ప్రభువు. ఆయన పరిపాలనక్రింద బీదప్రజలకూ రైతుకూలీలకు యెన్నో కష్టాలుండేవి. మన దేశంలో ప్రస్తుతం వున్నట్లే, జమీందార్లూ, పెద్దపెద్ద భూస్వాములూ, ధనికులూ, గొప్ప ఉద్యోగులూ నిరంతరం ప్రజల్ని పీక్కు తింటూండేవాళ్లు. ప్రజలకు చదువుకూడ తక్కువే, ఈ నిరంకుశత్వాన్నుంచి విడుదల అయేది ఎల్లాగోకూడ తెలియక వారు అల్లాడి పోయేవారు.

ఇట్లా వుండగా ఆదేశంలో చదువుకున్న యువకులు కొందరు బైలుదేరి, దేశాభిమానంతో, ప్రజల్ని అభివృద్ధి చేయడానికై పూనుకున్నారు. వారు ఎంతో కష్టపడేవారు. రాత్రింబగళ్లు బీద ప్రజలకోసం, కార్మికుల కోసం పాటు పడుతూండేవారు. రాత్రి పాఠశాలలు నడిపేవారు; కార్మికులకు సంఘాలుపెట్టి, వారిని తమ హక్కులకోసం పోరాడేటట్లు చేసేవారు; రైతులకు భూమికావాలని ఆందోళన చేసేవారు; బానిసత్వ పద్ధతి పోవాలనీ, అందరికీ ఓటు హక్కు కావాలనీ, విద్యా వైద్యసదుపాయాలు కావాలనీ,

లంచగొండితనం పోవాలనీ ఆ యువకులు యెడతెగక పోరాటం చేసేవారు.

దేశభక్తులైన యిట్టి ప్రజాసేవకులకు నాయకుడు వ్లాడిమిర్ ఇలిచ్ ఉల్యానోవ్. ఇతడే "లెనిన్" అనే పేరుతో ప్రపంచవిఖ్యాతుడైనాడు. లెనిన్ నాయకత్వం క్రింద విప్లవోద్యమం కార్మికుల్లోకి రైతుల్లోకి వ్యాపించి, బ్రహ్మాండంగా పెరిగిపోయింది.

ప్రజల హక్కులకోసం పోరాడే వారంటే జార్ చక్రవర్తికీ, అతని ఉద్యోగులకీ చాలా కోపంగా వుండేది. అది సహజమేనని మనకూ తెలుసు! అందుచేత అటువంటి వాళ్లని పట్టుకుని జైళ్ళలో పెట్టి, ద్వీపాంతరం పంపి, ఉరితీసి,—యింకా యెన్నో హింసలు పెట్టేది, ఆ ప్రభుత్వం. ప్రభుత్వానికి దొరక్కుండా మారుపేరులతోనూ, మారువేషాలతోనూ తిరుగుతూ, పనిచేస్తూండేవారు, ప్రజాసేవకులు. వ్లాడిమిర్ యిలిచ్ ఉల్యానోవ్ కూడ యెన్నో మారుపేర్లతో తిరిగేవాడు. అందులో 'లెనిన్' అనే పేరుతో యీయన యెన్నో గ్రంథాలు రాసేడు; పత్రికలకు వ్యాసాలు పంపేవాడు. చివరకి 'లెనిన్' అనే పేరే ఆయనకి స్థిరపడిపోయింది.

# లెనిన్ కుటుంబం, బాల్యం

ఈయన కుటుంబమంతా దేశభక్తి గలదే. ఆయన తండ్రి ఇల్యా నికోలయేవిచ్ ఉల్యనోవ్, స్కూళ్ల యిన్స్పెక్టరు. ఆయన విద్య నేర్పడానికి యెన్నో నూతన మార్గాలు కనిపెట్టేడు. గొప్ప విద్వాంసుడు, గర్వములేని నిరాడంబర ప్రజాసేవకుడు. ఉద్యోగస్థులకుండే దుర్గుణాలు ఆయనవద్ద లేవు. లెనిన్ తల్లి మరియా అలెగ్జాండ్రోవ్నా. ఆమెకూడ విద్యా సంస్కారాలు గలదే. ఈ దంపతులకు 1870 ఏప్రిల్ 22 వ తేదీని సింబిర్స్క్ పట్టణంలో వ్లాడిమిర్ జన్మించేడు. వ్లాడిమిర్ తల్లిదండ్రుల సద్గుణాలన్నీ పుణికి పుచ్చుకున్నాడు. ఆతనిలో పట్టుదల, దయ, నిరాడంబరత్వం, పరోపకారము, ధైర్యసాహసములు, సమయస్ఫూర్తి మొదలగు గుణాలు చిన్నతనంలోనే కనిపించేవి.

వ్లాడిమిర్‌కి అన్న అలెగ్జాండర్. ఆతడు లెనిన్‌ను మిక్కిలి ప్రేమించేవాడు. తమ్మునిచే యెన్నో గొప్ప గ్రంథాలు చదివించేవాడు. సుప్రసిద్ధులగు పుష్కిన్, టాల్‌స్టాయ్, తుర్గనేవ్, నెక్రాసోవ్, ఛెర్నిషేవ్‌స్కీ, లెర్మాంటోవ్ గొగోల్, చెకోవ్, బాగ్దనోవ్, పిస్సారేవ్ మొదలగువారి

రచనలను యేకాగ్రంగా చదివేవాళ్లు, లెనిన్ సోదరీసోద రులు. ప్రజల కష్టాలు తెలిసికోగలిగిందీ, వాటిని తొల గించుటకై పూనుకోవాలనుకున్నదీ కూడా అప్పటినుంచే. ఆ రోజుల్లో రష్యా అంతటా యువకులు యెన్నో రహస్య సంఘాలు యేర్పాటు చేసికొని, జార్ చక్రవర్తుల నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి పనిచేస్తూండేవారు. అలె గ్జాండరుకూడ యిట్టి ఒక సంఘములో చేరేడు. 1887 మార్చి నెలలో చక్రవర్తిని చంపుటకై 'పీటర్సుబర్గు లో ప్రయత్నించబడింది. ఆ కుట్రలోనివారని అలెగ్జాండరును అతని అక్క అన్నాను పోలీసులు అరెస్టు చేసేరు. అప్ప టికి లెనిన్ తండ్రి చనిపోయి సంవత్సరందాటింది. ఇంతలో యీ ఆపద పైబడింది. లెనిన్ తల్లి ఎంతో ఆత్మనిగ్రహం గలది. తాను దుఃఖిస్తూంటే పిన్నవయస్కులగు తన బిడ్డలు మరీ కంగారుపడిపోతారని ఆ వృద్ధురాలు ఎంతో ఓరిమితో యీఆపదల నెదుర్కొంది. చివర కెన్నిప్రయత్నాలుచేసినా, అలెగ్జాండరును విచారణచేసి, ఉరిశిక్ష విధించేరు. అన్నాను విడిచినా, యింటర్న్మెంటు చేసేరు. అన్నగారు ఉరితీయ బడినవార్త విని, వ్లాడిమిర్ గంభీరంగా, ఏదో ఆలో



ఉల్యనోవ్ కుటుంబం.

కుడిప్రక్క ముందువరసలో మొదట కూర్చున్నదే "లెనిన్"

4(A)



లెనిన్ బండిమీద ఎర్రజెండా యెగురుతూంది.
పొద్దు పొడిచింది. మంచు దిగిపోతూంది.

4 (B)

చనల్లో మునిగి అట్లే చాలసేపు నిలబడిపోయేడు. అన్నయం దాతని కెంతో భక్తి, ప్రేమ. ఆతడు ఎన్నడూ తప్పుపని చేయడని తెలుసును. దేశంకోసం ప్రజలకోసం తన అన్న త్యాగం చేసేడు; ప్రాణాల్ని అర్పించేడు. నిరంకుశమైన జార్ ప్రభుత్వం యీ విధంగా యెందరో యువకుల ప్రాణాల్ని బలిగొంటూంది. పర్వతాన్ని ఢీకొన్న పొట్టేళ్ళలా వుంది, వీరి ప్రయత్నం, పర్వతం చెక్కు చెదరడం



బాల్యంలో "లెనిన్"

లేదు. ఎన్నో అమూల్యప్రాణాలు బలియై పోతున్నాయి. ఇటువంటి వ్యక్తి హింసావాదం వల్ల ప్రయోజనం చాల తక్కువనీ, నష్టమే అధికమనీ ఆలోచనాపరులంతా గుర్తించేరు. అప్పటికి పదిహేడు సంవత్సరములవాడైన వ్లాడిమిర్ లేతమనస్సుపై యీసంఘటన గాఢంగా హత్తుకుపోయింది.

ఆరోజుల్లోనే మార్క్సు, ఏంజిల్సు మొదలగువారి గ్రంధాలు యువకుల నాకర్షించేయి. వ్లాడిమిర్ కూడ ఆ గ్రంధాలను చదువ నారంభించేడు. "అన్న ఆదర్శం గొప్పదే కాని, సాధనకై అవలంబించిన మార్గం మాత్రం సరియైనది కాదు. ప్రజాపోరాటం, ప్రజావిప్లవం,—యివే సామ్రాజ్యాన్ని కూలద్రోయడానికి మార్గం—" అని తెలిసి వచ్చింది, ఆ యువకునికి.

## విద్యార్థిగా

వ్లాడిమిర్ మొదట సింబిర్స్క్ పట్టణంలోని గ్రామర్ స్కూల్లోచేరి, 1887 ఏప్రిల్‌లో సెకండరీ విద్యను పూర్తి చేసేడు. ఆస్కూలు హెడ్‌మాస్టరు అతనిని గూర్చి సర్టిఫికెట్‌లో యిట్లా వ్రాసేడు: "వ్లాడిమిర్ ఉల్యానోవ్ చదువునుగూర్చీ, నైతికప్రవర్తనను గూర్చీ తల్లిదండ్రులు చాల శ్రద్ధవహించేరు. 1886 జనవరిలో తండ్రి పోయిన తర్వాత తల్లే బిడ్డలందరి చదువు పెంపకాల్ని గూర్చి బాధ్యత వహించింది..............కుటుంబంలోని శ్రద్ధ సత్ఫలితాల్ని యివ్వటంలో ఆశ్చర్యమేమీలేదు. వ్లాడిమిర్ ప్రవర్తనే యిందుకు ప్రత్యక్ష ఉదాహరణ."

1887 జూలై లో ఉల్యనోవ్ కుటుంబం అంతా 'కొకూ ష్కినో' కు మారింది. సింబిర్స్కులో వారి వునికి దుస్స హమై పోయింది. ఈ కుటుంబంలో ఒకడు రాజకీయంగా 'గొప్పనేరాన్ని' చేసి, ఉరితీయబడినాడనే విషయాన్ని ఉటంకరిస్తూన్నారా ప్రతీవారూ అనేటట్లు ప్రవర్తించేవాళ్లు. వ్లాడిమిర్ పెద్ద అక్కగారు అన్నాకూడ జారు హత్యా నేరంలో అరెస్టు అయింది. తర్వాత ఆమెను పదలివేస్తూ, కొకూష్కినో గ్రామంలో ఆమెను యింటర్న్ (నిర్బంధ నివాసం) గా వుంచింది, ప్రభుత్వం. అకారణంగా అందరూ యిక్కడే వుండ నిశ్చయించుకున్నారు. వ్లాడిమిర్ కాజాన్ విశ్వవిద్యాలయంలో చేరి చదువ నారంభించేడు. కాని అత డక్కడ ఎంతోకాలం చదువనక్కర లేకపోయింది. విద్యార్థి ఉద్యమంలో పాల్గొని, ఊరేగింపులు చేయించేడని అతనిని అక్కడనుంచి తరిమివేసేరు. అన్నగారు త్రొక్కిన విప్లవ పంథాయే వ్లాడిమిర్‌ను ఆకర్షించింది. అతనినికూడ కొకూ ష్కినో లో యింటర్న్ చేసింది, ప్రభుత్వం.

వ్లాడిమిర్‌ను అరెస్టు చేసినపుడు ఒక పోలీసువాడు, "ఎందుకు, అబ్బాయీ! యీ చిక్కుల్లో పడతావు? నువ్వు

రాతిగోడను తలతో బ్రద్దలుగొట్టాలని చూస్తున్నావు తెలుస్తుందా ?" అన్నాడట. దానిమీద వ్లాడిమిర్, "ఔను ! నిజమే, అది రాతిగోడే కావచ్చుగాని అంతా శిథిలమై పొట్లపండులా వుంది. ఒక్క త్రోపు తోస్తేసరి, అది కూలిపోయి తీరుతుంది !" అన్నాడు.

తిరిగి కాజాన్‌లోగాని, మరోచోటగాని యూనివర్సిటీలో చేరడానికి వ్లాడిమిర్ యెన్నిసార్లు కోరినా, అధికారులు నిరాకరిస్తూ వచ్చేరు. విద్యాశాఖామంత్రి, యీతని అప్లికేషన్ మీద 1889 అక్టోబరు 28 న యిట్లా వ్రాసేడు: "ఈ విద్యార్థి ప్రవర్తననుగూర్చి పోలీసు వార్దెసు నుంచి ఖోగట్టా తీసుకోవాలి." ఈనాటి మన అధికారులకూ, ఆనాటి రష్యన్ ఉద్యోగులకూ ఎంత దగ్గర పోలికో చూసేరా!

కాజాన్ ప్రాంతీయ పోలీసు ఉద్యోగి యిట్లా వ్రాసేడు. "కాలేజీలోవున్న కొద్దిరోజుల్లోనూ యితని ప్రవర్తన చిత్రంగా వుంది. చదువుమీద శ్రద్ధలేదు; చాల నిర్లక్ష్యంగా వుండేవాడు. మీటింగుకు ముందు రెండు మూడు రోజులూ యితడు అస్తమానం హాల్లోనే యితర విద్యార్థులతో

యేవేవో మాట్లాడుతూ గడిపేడు. తరచు యింటినుంచి యేవో అనుమానాస్పదములైన 'కట్టల్ని' తెచ్చి విద్యార్థుల కిచ్చేవాడు. డిసెంబరు 4వ తేదీని (1887) ముందర బెంచీల మీద కూర్చుని, యితనూ, పోల్యాన్‌స్కీ,—యిద్దరూ లేచి అరుస్తూ, బైటి వరాండాలోంచి నడిచినమీదటే యితర విద్యార్థులు వీళ్ల ననుసరించేరు."

"ఈ ఉల్యానోవ్ కుటుంబమే చాల ప్రమాదకరమైంది. ఇతను చట్టవిరుద్ధంగానూ, అక్రమంగానూ ప్రవర్తిస్తాడన డంలో యేమీ సందేహం లేదు."

"రాజకీయనేరానికై ఉరితీయబడిన అలెగ్జాండర్ యితని అన్నగారే. ఇతడు చాల తెలివిగలవాడు, చదువుకున్నవా డూనూ. అందుచేత యితణ్ణి నమ్మడానికి అసలే వీలులేదు. నైతికంగానూ, రాజకీయంగానూకూడా యితడు ప్రమాద కరమైనవాడు."

అందుమీదనే వ్లాడిమీర్ దరఖాస్తును విద్యాశాఖామంత్రి త్రోసివేసేడు. విదేశాలకు పోయి చదువుకోడానికి ప్రయ త్నించినా, ప్రభుత్వానుమతి లేకపోవడంచేత, అదీ జరగ లేదు. చివరకి పీటర్సుబర్గు యూనివర్సిటీలో పరీక్షకు కూర్చో

డానికి 1890 మార్చిలో అనుమతి దొరికింది. లెనిన్ తీవ్ర కృషి గావించి, 1891 లో పరీక్షకు కూర్చుని, ఆనర్సుతో సహా ప్యాసయ్యేడు.

కొజాన్, సమారా పట్టణాల్లోవున్న ఐదు సంవత్సరాల్లోను వ్లాడిమిర్ తన విజ్ఞానాన్నెంతో పెంపొందించుకొన్నాడు, ఎన్నో సిద్ధాంతగ్రంథాలను క్షుణ్ణంగా చదివేడు. 1893 లో వీరి కుటుంబం అంతా మాస్కోకు వచ్చేరు. వ్లాడిమిర్ తమ్ముడు డిమిత్రీ మాస్కో యూనివర్సిటీలో చేరేడు. ఆరోజులలో విప్లవానికీ, కార్మికోద్యమానికీ కేంద్రమైనది, పీటర్స్‌బర్గు. కుటుంబాన్ని మాస్కోలో వదలి వ్లాడిమిర్ పీటర్స్‌బర్గుకు పోయి అక్కడే వుండి పనిచేయ నారంభించేడు.

ఒకసారి లెనిన్ తల్లి యేదో పిటిషన్ సందర్భంలో పీటర్స్‌బర్గ్ పోలీసు కార్యాలయానికి వెళ్లాల్సి వచ్చింది. అక్కడి పోలీసు ఆఫీసర్ కూడ ఆశాఖలోని అందరికివలెనే పశుప్రాయుడు. ఆమెతో బహు విరసంగా మాట్లాడి, ఆమెను నొప్పించడానికై: “నీ పెద్దకొడుకు ఉరిస్తంభంమీద చచ్చేడు. రెండోవాడి కోసం కూడ ఉరిత్రాడు సిద్ధంగానే

వుందిలే!" అన్నాడు. ఆ ధీరమాత ఎంతమాత్రం భయపడలేదు. "అయ్యో! నాయనా! అంతటి అదృష్టం లభిస్తే ఏతల్లి గర్వపడదో!" అందిట! వ్లాడిమిర్ తల్లిని మిక్కిలి ప్రేమించేవాడు. ఆమెకూడ తన సంతానంమీద ప్రేమ కలిగి వుండడమేగాక వారి విప్లవ భావాల నర్థం చేసికొని, యెంతో సానుభూతి గలిగి వుండేది. తన కార్యక్రమాన్ని తల్లికి తెలియకుండా దాచవలసిన అవసరం ఏమీ వ్లాడిమిర్‌కి వుండేదిగాదు. వ్లాడిమిర్ అక్క అన్నా, చెల్లెలు మరియా, తమ్ముడు డిమిట్రీ కూడ విప్లవసాంప్రదాయాల్లో ఆరితేరినవారు. అదొక విప్లవ కుటుంబం!

## మహాజరు

జార్ ప్రభుత్వంమీద విప్లవం చేయ ప్రయత్నించినందుకై వ్లాడిమిర్‌ను 1895 డిసెంబరు 20 వ తేదీ రాత్రి పీటర్స్‌బర్గ్ పోలీసులు అరెస్టు చేసేరు. జైలులో 14 నెలలు గడపిన తర్వాత 1897 ఫిబ్రవరిలో శిక్ష విధించేరు. వ్లాడిమిర్‌కు మూడు సంవత్సరాలు ప్రవాసశిక్ష విధించేరు. తూర్పు సైబీరియాలోని 'షూషెన్‌ష్కోయి' అనే గ్రామం

లోనే అతడు నివసించాలి. ఇది ఒక కుగ్రామము. దీని పేరుకూడ యెవరూ విని వుండరు. దీనిని షూ-షూ-షూ అని చమత్కారంగా పిల్చేవాడు, వ్లాడిమిర్.

వ్లాడిమిర్ ఇలిచ్ ఉల్యానోవ్‌ను లెనిన్ అని అప్పటికే రష్యా అంతటా పిలిచేవాళ్లు, అతని అసలుపేరు చాలమంది మరిచేపోయేరు.

లెనిన్‌నీ, అతనితోబాటు మరికొందర్నీ కూడ యీ గ్రామానికి ప్రవాసం పంపేరు. లెనిన్‌కి పేదరైతులంటే ఎంతో ప్రేమ. వారికి ఆపదలు వచ్చినపుడు ఆదుకుని సాయం చేయడానికి అతడెప్పుడూ సిద్ధంగా వుండేవాడు.

ఆగ్రామానికి చుట్టూ చాల దూరందాకా దట్టమైన అడవులే. ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి పోవాలంటే చాల దూరము అడవుల్లోనుంచే పోవాలి. గ్రామాలకు కొంచెం దూరంగా వున్న అడవులన్నీ చక్రవర్తివే. అరణ్యం మధ్య కాపురమున్నా రైతులెవరూ హద్దుమీరి ఒక్క చెట్టుకూడా ముట్టుకోడానికి వీల్లేదు. అటవీ ఉద్యోగులు యెప్పుడూ కాపలా కాస్తుంటారు.



"మహజరు యిచ్చేవా, తాతా ? ఏం చేసేవు, కాగితం ?"
డిమిట్రీ తడబడుతూ, నీళ్లు నమలడం ఆరంభించేడు.

12(A)



"ఆఁ! ఈ మనిషి అనుమానించదగినవాడుకాదురా !"
"ఎవడో ప్రొద్దున్నే షికారు పోతున్నాడులే."

12(B)

పురాతనకాలంనుంచీ అక్కడి ప్రజలు అడవిని కొట్టి, పోదు తగులబెట్టి శుభ్రపరచుకుని, సాగు చేసుకునేవారు. ఆ శీతల దేశంలో ప్రతియింటా నిరంతరం నెగళ్లు మండుతూనే వుంటాయి. వాటిలోకి కావలసిన పుల్లా పుడకాకూడా అడవులలోనుంచే తెచ్చుకుంటారు.

ఒకరోజున షూషెన్‌స్కోయి గ్రామంలోని రైతొకడు తన పొలంలోని ఎండుగడ్డీ, ఓకులూ చేర్చి, చలిమంట వేసుకున్నాడు. నెరుసులు గాలివాటున యెగిరి వెళ్ళి అరణ్యాం అంటుకుంది. దానిలోని మంచిచెట్లు యెన్నో భస్మమై పోయేయి.

అడవి కాపలాదారు గ్రామానికి వచ్చి, నిప్పు పెట్టిన దెవరా అని విచారించేడు. ఎవరూ చెప్పలేదు. నిప్పుకి కారణం తెలియలేదు. అయినా ఉద్యోగం నిలబడాలంటే యెవరో ఒకరిమీద నేరం మోపాలికదా! అందుకని డిమిట్రీ దానిలోవిచ్ అనే రైతుమూలంగా అడవంతా పరశురామ ప్రీతై పోయిందని పైఅధికారులకు తెలియపరచేడు. డిమిట్రీ కొంపా గోడీ జప్తుచేసి, నష్టాన్ని రాబట్టవలసిందని ప్రభుత్వం ఆజ్ఞాపించింది. గ్రామం అంతా యీదురన్యా

యానికి అట్టుడికిపోతూంది. కాని యేమిచేయాలో యెవరికీ తోచలేదు. ప్రభుత్వోద్యోగులంటే, పాపమూ అమాయిక రైతుల కంత హడలు.

డిమిట్రీ యింటికి సమీపంలోనే ప్రవాసియైన లెనిన్ వుంటూండేవాడు. ఆత డొకరోజున షికారుకు పోతూ దిగాలుపడిపోయి కూర్చున్న డిమిట్రీని చూసేడు. ఆతనిని సమీపించి, పరామర్శించేడు :

"ఏం తాతా ! ఏదో దిగాలుగా వున్నావేం ?"

"ఔను, నాయనా ! పెద్ద చిక్కులో పడిపోయేను. ఈ ఆపద దాటడం ఎల్లాగో ? వ్లాడిమిర్ ! చక్రవర్తిగారు కాగితం పంపేరు. అడవి తగులడిందే, ఆనష్టం యిచ్చుకోమని. లేకపోతే, నాయిల్లూ వాకిలీ జప్తుచేసి, నన్ను జైలుకి పంపుతారుట. దిక్కులేని మాబోటివాళ్ళకి దేవుడే తోడు. నాభార్యా, పిల్లల గతేమిటని విచారిస్తూన్నా, బాబూ !" అన్నాడు. ఆ రైతు.

రైతు చెప్పినదంతా శాంతంగా విని, లెనిన్ ఆలోచించేడు. ఒక్క నిముషం ఆగి, అన్నాడు :

"తాతా ! నీ భూమి జప్తుచేయడానికి వాళ్ళకి అధికారం

లేదు. కోర్టులో విచారణ జరగాలి; నేరం ఋజువు కావాలి; తీర్పు చెప్పాలి. నేను మహాజరు కాగితం రాసి యిస్తాను. పట్టణానికి వెళ్ళి ఫారెస్టు ఆఫీసరుకు యిచ్చిరా."

"ఆమూరాజు నేనిచ్చే కాగితం తీసుకుంటాడా? అబ్బే! ఆఫీసర్లకి మాబోటివాళ్ళంటే లెక్కా, బాబూ!"

"తీసుకోకపోతే, టేబుల్‌మీద పెట్టిరా, తాతా."

"లాభం లేదు. కాగితం చింపి పారేసి, నానాబూతులూ తిట్టి, గెంటిస్తాడు, కూడాను."

ఇదంతా నిజమేనని లెనిన్ యెరుగును. అయినా ఊరు కుంటే యెట్లాగ? ఈ అన్యాయాన్ని యెదిరించే తీరాలి.

"తాతా! అట్లా జరిగితే చూద్దాం. పోస్టులో పడేస్తే ఎట్లాగూ వాళ్లు తీసుకోక తప్పదు. భయపడి, ఊరుకుంటే యీ అన్యాయాలు తొలగే దెట్లా?"

చివరకి డిమిత్రీ, లెనిన్ చెప్పినట్లే చేయాలని నిశ్చ యించుకున్నాడు. కాగితం వ్రాసి, డిమిత్రీచేత వేలుముద్ర వేయించేడు, లెనిన్. మహాజరు కాగితం పట్టుకుని పట్నా నికి వెళ్లేడు రైతు. కాని, అమర్నాడు తిరిగి వచ్చేటప్పుడు ఆతని ముఖం మరీ దైన్యంగా వుంది.

లెనిన్ రైతును తన యింటికి పిలుచుకుని పోయేడు. సంగతి సందర్భాలేమిటో తెలిసికోవాలి. కూర్చోపెట్టి, 'విశేషాలేమిట'ని అడిగేడు.

"విశేషాల కేముంది, నాయనా! దారీతెన్నూ తోచడం లేదు........అంతా అంధకారమే, వ్లాడిమిర్!"

మాట్లాడుతూన్నాడేగాని డిమిట్రీ, లెనిన్‌వైపు చూడడమేలేదు. అతడు తన దృష్టిని తప్పించుకుంటున్నాడని లెనిన్ కనిపెట్టేడు.

"మహాజరు యిచ్చేవా, తాతా? ఏంచేసేవు కాగితం?"

డిమిట్రీ తడబడుతూ, నీళ్లు నమలడం ప్రారంభించేడు. జేబుల్లో చేతులు పెట్టి తడుముతాడే గాని, పైకి యేమీ రాలేదు. అతని ముఖం సిగ్గుతో యెర్రబడి పోయింది, చిట్ట చివరకి.

"వ్లాడిమిర్! ఏమనుకోకు........నాభార్య యెక్కడో పారేసింది, కాగితాన్ని" అన్నాడు.

లెనిన్‌కి చాలా కోపం వచ్చింది. గదిలో గబగబా పచారు చేస్తున్నాడు. కాని డిమిట్రీని యేమీ పల్లెత్తుమాట కూడా అనలేదు. అధికారులంటే యీరైతు లెంతభయపడ

తారో ప్రత్యక్షంగా చూస్తున్నాడు. అతనికోపం, యీ అమాయిక ప్రజలమీద గాదు; రాక్షసులకంటే కఠినులైన అధికారులమీదే వుంది. కొంచెంసేపు అటునిటు పచారుచేసి, రైతువైపు తిరిగి, మళ్ళీ అన్నాడు :

"తాతా! ఇల్లా ఊరుకుంటూంటేనే వాళ్ళు నెత్తి కెక్కుతూన్నారు. మనం భయపడకూడదు. ఈ అన్యాయాన్ని నిర్భయంగా, ఎన్నికష్టాలు వచ్చినా సరే యెదుర్కోవాలి. మన హక్కులకోసం ప్రాణాలొడ్డి పోరాడాలి. సరే. నేనే మహజరు తేసుకొని, పట్నానికి వెడతానులే. దీని అంతు కనుక్కుందాము."

కూర్చుని మళ్ళీ కాగితం రాసి, డిమిట్రీచేత వేలుముద్ర వేయించేడు. ఆ రైతుకు, పాపం, భయంగానే వుంది. చక్రవర్తిగారి ఉద్యోగులు యిచ్చిన ఆజ్ఞకి వ్యతిరేకంగా అర్జీ పెడితే, ఊరుకుంటారా? బ్రతకనిస్తారా? లెనిన్, మహజరును తీసుకొని, మర్నాడే పట్నానికి పోయి, ఫారెస్టు ఆఫీసరుకు యిచ్చి వచ్చేడు.

రోజులు గడచి పోతున్నాయి. నెలలు గడిచేయి. ఏమీ జరగలేదు. డిమిట్రీ యిల్లూ వాకిలీ జప్తు చేస్తామని ప్రభు

త్వోద్యోగు లెవరూ రాలేదు. ఆ పేదరైతు కుటుంబం రక్షించబడింది.

లెనిన్, ఆగ్రామాన్నుంచి వెళ్ళిపోయిన తర్వాతకూడా రైతులు లెనిన్ పేరు చెప్పుకుని, ఉప్పొంగి పోయీవాళ్ళు. ఈసంఘటన వాళ్ళ మనసుల్లో స్థిరంగా ముద్రించబడింది.

"ఏమనుకున్నారు? లెనిన్ అర్జీరాసేడంటే, బంటుని తోసి రాజు! చక్రవర్తిగారి ఆటకట్టు! వ్లాడిమిర్ యిలిచ్ అంటే సింహస్వప్నం! రైతు రక్షకుడు మారాజు!" అంటూండే వాళ్ళంతా.

## మళ్లీ అరెస్టు

సైబీరియా ప్రవాసశిక్ష పూర్తి అయేక లెనిన్ రష్యాకు వచ్చేడు. పీటర్సుబర్గు, మాస్కో మొదలైన పెద్దపట్టణాల్లో వుంటే కార్మికుల్లో సంచలనం కలుగుతుందని జారు ప్రభుత్వం నిషేధించింది. అందుచేత లెనిన్ 'స్కోవ్' లో వుండడానికి నిశ్చయించుకున్నాడు. ఇక్కడినుంచి రైలు మీద పీటర్సుబర్గుకు చాల దగ్గర. అప్పుడప్పుడు స్నేహితులు

వచ్చి సలహాలు తీసికొని వెడుతూండేవాళ్లు. లెనిన్ కూడ పోలీసు అధికారులకు తెలియకుండా రహస్యంగా రెండు సార్లు పీటర్సుబర్గుకి వెళ్ళి వచ్చేడు. అంతమంది పోలీసు గూఢచారులున్నా, లెనిన్ పీటర్స్‌బర్గ్ వెళ్ళినట్లు కనుక్కో లేకనే పోయేరు!

మూడోసారి లెనిన్ తన తమ్ముడు డిమిత్రీ యిలిచ్‌తో కలిసి పీటర్స్‌బర్గ్‌కు ప్రయాణమయ్యేడు. ఓ పెద్ద పళ్ళగంప కూడా మోసుకు పోయేరు, అన్నా తమ్ముడూ. రహస్యంగా ఉంచుతానంటే మీతో ఓ సంగతి చెపుతా. ఆ గంపలో వున్నవి, పళ్ళుగాదు! జారు ప్రభుత్వం ఆ రోజుల్లో చాల గ్రంథాల్ని నిషేధించేది. అందుచేత విప్లవకారులూ, ప్రజా సేవకులూ ఎన్నో పుస్తకాల్ని రహస్యంగా అచ్చువేసేవారు; విదేశాలనుంచి మారుపేర్లతో తెప్పించేవాళ్లు! వాళ్లు తీసుకు పోయిన పళ్ళగంపలో కూడా యిల్లాంటి పుస్తకాలూ, కరపత్రాలూ వుంచి, పైన కొద్దిగా పళ్లూ, పువ్వులూ వుంచేరు. గోడలకి చెవులుంటాయంటారు, జాగ్రత్త!

రైలు స్టేషనులో గాని, రైల్లో గాని వీళ్ళనెవరూ చూడ లేదు. ఎవరూ వెంటబడడం లేదని, లెనిన్ తెలుసుకున్నాక

అతని మనసు కుదుటబడింది. అయినా యెందుకేనా మంచిదని దారిలోని జంక్షనులో దిగి, మరోవైపునుంచి వచ్చేబండి యెక్కేడు. ఆవైపునుంచి లెనిన్ వస్తాడని ఎవరూ అనుమానించరు.

రైలు జార్‌స్కోయియెసెలో దాటింది. అక్కడినుంచి పీటర్సుబర్గు వచ్చింది. ఏమీ ప్రమాదంలేకుండానే గడిచింది. అన్నింటికీ మూలం ఆ పళ్ళగంపను, సురక్షితంగా ఒక స్నేహితుడు అందుకుని, తీసుకుని పోయేడు. లెనిన్ ఆ రాత్రంతా స్నేహితబృందంతో చర్చలలో గడిపి, ఉదయమే బైలుదేరేడు. ఆ రైలులో బైలుదేరి యింటికి తిరిగి పోదామని లెనిన్ అనుకున్నాడు.

వీధులో వెడుతూంటే హఠాత్తుగా యిద్దరు పోలీసులు వచ్చి లెనిన్ రెండు చేతులూ పట్టుకున్నారు. చెయ్యి వొదులుతే యే రహస్యకరపత్రమో తీసి నాశనం చేస్తాడని వాళ్ళ ఆదుర్దా. ఏదో అటువంటి కాగితం దొరికితే, మళ్ళీ కేసు పెట్టి, సైబీరియాకి పంపి, పీడ వదల్చుకుందామని పోలీసుల ఆశ. ప్రమాదవశాత్తూ లెనిన్ జేబులో అట్లాంటి కాగితం ఒకటి ఉండనే వుంది.



లెనిన్, స్టాలిన్‌లు స్మోల్నీలో అక్టోబరు విప్లవ ప్రథమ దినాల్లో.

20 (A)



టాంకుమీద నిలబడి లెనిన్ మాట్లాడేడు.
"కామ్రేడ్స్! అధికారం కష్టజీవులదే. కార్మికులు, సైనికులు, రైతులు,-
అధికారాన్ని తీసుకోండి!"

20(B)



లెనిన్, స్టాలిన్‌లు స్మోల్నీలో అక్టోబరు విప్లవ ప్రథమ దినాల్లో.

20(c)



టాంకుమీద నిలబడి లెనిన్ మాట్లాడేడు.
"కామ్రేడ్స్। అధికారం కష్టజీవులదే. కార్మికులు, సైనికులు, రైతులు,-
అధికారాన్ని తీసుకోండి।"

20 (1)

పైకి అవొక మామూలు బజారుబిల్లు. దానిమీద పంక్తుల నడుమ కనబడని సిరాతో కొన్ని రహస్యవిషయాలు వ్రాసి వున్నాయి. అది చదవాలంటే కాగితాన్ని నిప్పుసెగమీద వెచ్చబెట్టాలి! పోలీసులు ఎంత తంటాలుపడ్డా ఏమీ తెలుసుకోలేక పోయేరు. స్టేషన్‌కి తీసికెళ్ళి, అంతా వెతికేరు. అతని దగ్గరున్న కాగితాలన్నీ లాక్కున్నారు. అదేదో మామూలు బిల్లనుకుని, దాని విషయమే యెవరూ పట్టించుకోలేదు!

పర్మిషన్ లేకుండా పీటర్స్‌బర్గ్‌కి వచ్చినందుకు రెండు వారాలు లెనిన్‌ను జైలులో పెట్టేరు. అంతకంటె వేరేమీ కేసు దొరకలేదు వాళ్ళకి. పళ్ళగంప, బజారుబిల్లూ విషయం పోలీసులు తెలుసుకోనే లేకపోయేరు!

చేతికి దొరికిన లెనిన్‌ను ఇంతసులభంగా పోనీయడమంటే పోలీసులకి కడుపుబ్బింది. అందులో ఒక ఆఫీసరేం చేసేడనుకున్నారు! విదేశాలకి పోడానికి ఎంతో ప్రయాస మీద లెనిన్ సంపాదించిన 'ప్యాస్‌పోర్టు' (అనుమతి పత్రం) ను తొక్కిపట్టేడు. లెనిన్ దగ్గర తీసికొన్న సామానంతా యిచ్చేటపుడు ఆ కాగితాన్ని మాత్రం యివ్వలేదు. టేబిల్ మీదికి వంగి దర్జాగా మీసం దువ్వుతూ;

"ఆఁ! యింక నువ్వు వెళ్ళచ్చు" అన్నాడు.

"నా ప్యాస్‌పోర్టు వుంచే వెందుకు? ఇట్లాతే."

"టాట్! వెళ్లు! నేనివ్వను. ఏం చేస్తావేమిటి?"

లెనిన్‌కి వొళ్లు మండిపోయింది. కాని పైకి నిశ్చలంగా, "ఇది చట్టానికి విరుద్ధం. ఈ అన్యాయాన్ని సాగనివ్వను. చూద్దుగానిలే!" అంటూ స్టేషన్‌లోంచి గబగబా నడుస్తున్నాడు. పోలీసు ఆఫీసరు జంకేడు.

"ఇదిగో! ఏమయ్యోయ్! తీసుకుపో!.............నిన్నే! ప్యాస్‌పోర్టు యిదిగో! ఏదో వేళాకోళానికంటే అంత కోప మెందుకూ?" అంటూ బొంకేడు. పిరికితనం ఎంతను కున్నారు?

లెనిన్ ప్యాస్‌పోర్టు తీసికొని, బైటకు వచ్చేసేడు.

"ఓరి ముసలినక్కా! నీబుద్ధిమాత్రం గాడిదబుద్ధే! పిరికి పందా!"

ఆఫీసర్ల బుద్ధిహీనతనూ, దబాయింపునూ, పిరికితనాన్నీ తలచుకొని నవ్వుకుంటూ లెనిన్ వెళ్ళిపోయేడు.

## మాతృదేశాగమనం

1905 లో లెనిన్ స్విట్జర్లాండు వెళ్ళి అక్కడే చాల కాలం వున్నాడు. జినీవానుంచి "ఫార్వర్డు" అనే పత్రికను నడుపుతూ, ఎన్నో గ్రంథాల్ని ప్రకటిస్తూవుండేవాడు. వాటి నన్నిటినీ రహస్యంగా రష్యాకు పంపేవాడు.

ఇంతలో 1914 యుద్ధం వచ్చింది. రష్యన్ ప్రజలు చాల బాధలు పడిపోయేరు. కరువు, వ్యాధులు, మరణాలు వ్యాపించినాయి. ఈ బాధల్ని సహించలేక ప్రజలు తిరుగు బాటు చేసేరు. సైన్యాల్లోకూడ తిరుగుబాటు వ్యాపించింది. జారుచక్రవర్తిని ప్రజలు ఖైదీగా పట్టుకున్నారు. ఇదంతా 1917 మార్చిలో జరిగింది.

ఈ విషయం తెలిసి లెనిన్ స్వదేశానికి పోడానికి చాల తొందరపడ్డాడు. దేశానికి వెళ్ళి, ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో తానూ పాల్గొనాలి. కాని చుట్టూ దారుణ యుద్ధ జ్వాలలు. సరిగా రాకపోకలు లేవు. లెనిన్‌ను రష్యాకు పంపితే తమకు అటునుంచి యుద్ధపు ఒత్తిడి తగ్గుతుందని ఆలోచించి, జర్మన్ ప్రభుత్వం, లెనిన్‌కీ, మరికొందరికీ

తమ దేశంగుండా పోడానికి అనుమతి నిచ్చింది. వారు జర్మనీ, స్వీడనులద్వారా రష్యాలో దిగడానికి యేర్పాటైంది. ఒక్క షరతుమాత్రం పెట్టేరు. దారిలో యెక్కడా యేజర్మన్‌తోనూకూడా లెనిన్ మాట్లాడకూడదు! లెనిన్ మాటలు విని, జర్మన్ ప్రజలే తమ నిరంకుశ ప్రభుత్వాన్ని పాలద్రోస్తారని జర్మను చక్రవర్తికి భయం. లెనిన్, అతని స్నేహితులూ ఒక రైలుపెట్టెలో కూర్చున్నారు. ఆపెట్టెలో యెవరినీ యెక్కనీయకుండా సైనికుల్ని కాపలా పెట్టేరు. ఎవరూ, ఎక్కడా దిగకుండా దానికి తాళం వేసేరుకూడాను.

రైలుబండి అతివేగంగా జర్మనీ సరిహద్దుల్ని సమీపిస్తూంది. అది మార్చినెల. అప్పుడే స్విస్ స్టేషన్లలోని ఉన్న పూలతోటల్లో గులాబులు మొగ్గ తొడుగుతున్నాయి. శీతకాలం ఆఖరై వసంతఋతువు ప్రవేశించింది. స్విట్జర్లాండు పర్వతాలమీది మనోహరదృశ్యాలు క్రమంగా వెనక బడుతున్నాయి.

లెనిన్ కిటికీదగ్గర కూర్చుని, ఏదో గబగబా రాస్తూన్నాడు. బైటి ప్రపంచదృశ్యాల్ని దాటి అతని మనస్సు రష్యాలోని క్లిష్టసమస్యల్ని గూర్చి ఆలోచిస్తూంది. ఉన్న

ట్లుండి రాస్తూన్న కాగితాల్ని ప్రక్కకి నెట్టి, నాద్‌జ్యాదాతో అన్నాడు :

"రష్యా వెళ్లేక కొద్దిరోజుల్లో మనల్ని ఎరస్టుచేస్తారు!"

లెనిన్‌కి 'జ్యోతిషం' తెలుసుననుకొనేరు సుమా! ఆకాశంలోని గ్రహగతుల్ని బట్టిగాక రాజకీయగ్రహాల వర్గ స్వభావాన్నిబట్టి రానున్న సంఘటనలను ముందుగానే చెప్ప గల జ్యోతిష్కుడు, లెనిను!

దినపత్రికలలోని వార్తలద్వారా జారు ప్రభుత్వం కూలి పోయిందనీ, మరో నూతన ప్రభుత్వం ఏర్పడిందనీ, అందులో ప్రజానాయకుల కంటె జమీందారులు, కోటీశ్వరులు, మిల్లు యజమానులే యెక్కువ పెత్తనం చెలాయిస్తూన్నారనీ తెలుస్తూంది. కార్మికులకీ, రైతులకీ, సైనికులకీ అధికారం హస్తగతం కావాలనే బోల్షివికు నాయకులను వారు అరెస్టు చేయించుటలో ఆశ్చర్యమేముంటుంది?

ఆపెట్టెలోని వాళ్ళంతా గుంపులుగా చేరి, సిగరెట్లు కాలుస్తూ, లోకాభిరామాయణం చెప్పుకుంటున్నారు. లెనిన్ కూడ తమ బాతాఖానీలో దిగుతే బాగుండుననుకుంటున్నా, ఎవరూ వెళ్ళి అతన్ని పిలవలేను. ఇంతలో యెవరో పాట మొదలు పెట్టేరు.

కారుమేఘాల కారుచీకట్లు
కమ్ముకున్నాయ్, దిక్కులన్నిటినీ;
కష్టదినాలూ, క్లిష్టసమస్యలూ,
రణరంగంలో దిక్కుతోచదూ,
సారధీ! నీపలుకే బంగారమైతే,
ఆపదగడచే ఆలోచనేమిటి?
రథసారధివి! మాధారమునీదే!

పాట విని, లెనిన్ కూడ కారిడార్ (వసారాలాంటిది) లోకి వచ్చేడు. వాళ్ళతోబాటుగా పాటలు అందుకున్నాడు. అంతా వుషార్‌గా వున్నారు. జర్మనీ సరిహద్దుల్ని సమీపించినప్పుడు మాత్రం పాట నిలిపేరు.

జర్మనీ రేవుపట్టణాన్ని చేరింది, రైలు, చివరకి. అక్కడ ఒక బ్రహ్మాండమైన ఓడ నిలుచుని వుంది. రైలు రైలంతా సరాసరిగా ఆఓడమీదికి నడిచి పోయింది. అయినా యింకా ఎంతో స్థలం వుంది, దానిమీద. లెనిన్ రోజుల్లోకంటె నేడు యింకా పెద్దఓడలున్నాయి. మీరు ఎప్పుడేనా ఓడ లోపలకు వెళ్ళి చూసేరా?

సముద్రంలో ముందు పాతరలు తప్పించుకుంటూ,

స్టీమరు జాగ్రత్తగా నడిపించాలి. వీటికితోడు ఉత్తర సముద్రాల్లో తుపానులు నిరంతరం జోరుగా వుంటాయి. ఎల్లాగైతేనేం స్వీడన్ తీరానికి చేరేరు. స్టాక్‌హోం నుంచి తాను వస్తూన్నట్లు లెనిన్, పీటర్స్‌బర్గుకు టెలిగ్రాం యిచ్చేడు.

"చుట్టు అయినా మెట్ట మేలు!" అనే సామెత యెరుగుదురుగాదూ? స్టాక్‌హోం నుంచి నేలమార్గాన్ని పీటర్స్‌బర్గ్‌కి పోవాలంటే చాల ఆలస్య మవుతుంది. ఒక్క క్షణం కూడ ఆలస్యం కావడం లెనిన్‌కి యిష్టంలేదు. అంచేత మంచుమీద సరాసరిగా పోదామని నిశ్చయించేడు. అఖాతం అంతా గడ్డకట్టింది. తెల్లవారుఝామున తీరానేవున్న పల్లెకారుల గ్రామం చేరుకున్నారు. పొగ మంచు లేకపోతే ఆవలనున్న రష్యన్ తీరం కనిపిస్తూనే వుంటుంది. కాని ఆరోజున దట్టంగా పొగ మంచు పట్టింది. అడుగుదూరం కూడా ఆనడం లేదానాడు.

లెనిన్ స్నేహితబృందం అంతా కలిసి ముప్పైమంది దాకా వుంటారు. అంతా బైలుదేరేరు. స్వీడనువాళ్లు శీతకాలంలో "స్లెడ్జి" బళ్ళమీద ప్రయాణం చేస్తారు. ఆ బళ్ళకి చక్రాలుండవు. రెండు పొడుగైన నిడుపుకమ్ములమీద బండి

చట్రం బిగించి, సీట్లు యేర్పాటు చేస్తారు. దీన్ని గుర్రాలు గాని, రెయిన్‌డీర్‌గాని, కుక్కలుగాని లాగుతాయి. నేల అంతా మంచు గడ్డకట్టి వుంటుంది గనక యీ స్లెడ్జీలు దాని మీద మహావేగంగా జర్రుమని జారిపోతాయి. స్లెడ్జి తోలే వాడుగాక మరో యిద్దరు మాత్రం కూర్చునే చోటుంటుంది. వీటిలో అందరికీ పదిహేను స్లెడ్జీలు కట్టించేరు. చిరు గంటలు మోగుతూంటే బళ్లు ఒకదాని వెనక ఒకటిగా పరు గెత్తుతున్నాయి. గంటలు ఎందుకు కడతారో తెలుసా? పొగమంచులో ఏమీ కనిపించదు. అందుచేత యెదురుగా యేబండో, మనిషో వస్తూంటే వారికి హెచ్చరికగా వుండ డానికి శబ్దం చేయడ మొక్కటే మార్గం. అందుకని ఆదే శపు స్లెడ్జిబళ్ళకీ, గుర్రాలకీ చిరుగంటల ముస్తాబు.

లెనిన్‌యెక్కిన స్లెడ్జి మధ్యలో పోతూంది. ఎవరో అరి చేరు, లెనిన్ బండి ముందు నడవాలని. బండి తోలేవాడు చెబుకుతో గుర్రా న్నదలించేడు. ముందు బండిలోని యువతి తలకు కట్టుకున్న ఎర్ర రుమాలు తీసి జెండాగా యెగురవేయడానికి ప్రయత్నిస్తూంది. ఆమె బండి దాటి పోయేటపుడు లెనిన్ చేయి జాచి ఎర్ర రుమాలు నందు

కున్నాడు. లెనిన్ బండిమీద ఎర్రజెండా యెగురుతూంది.

ప్రొద్దెక్కింది. పొగమంచు దిగిపోయింది. ఎదుటనే ఓ పెద్ద భవనంమీద రెపరెపలాడుతూ మరో ఎర్రజెండా వీరికి స్వాగతమిస్తూంది. ఆ భవనమే రైలుస్టేషన్. నావికులు, సైనికులు ఆ స్టేషనును స్వాధీనం చేసుకుని, ఎర్రజెండా యెగురవేసి, లెనిన్ రాకకై యెదురు చూస్తున్నారు.

రష్యన్ విప్లవనౌకకు కర్ణధారి లెనిన్. అప్పటివరకు ఉవ్వెత్తుగా వస్తూన్న విప్లవ వెల్లువ లెనిన్ రాకతో ప్రవాహంగా సాగింది.

## షికారు

లెనిన్ రష్యాకు వచ్చి మూడు నెలలైంది. అతడు పెట్రోగ్రాడ్‌లో షిరోకయావీధిలో నివశిస్తున్నాడు. అతనితోకూడ భార్య నాద్‌జ్యాదా, అక్కగారు అన్నా, చెల్లెలు మరియా ఉంటున్నారు.

జారు చక్రవర్తిని కూలద్రోసి ప్రభుత్వాధికారాన్ని తీసికొన్న కెరన్స్కీ ప్రభుత్వంకూడ ధనికులతోనూ, జమీందార్లతోనూ చేరి, అధికారాన్ని ప్రజలచేతుల్లో పెట్టడానికి

నిరాకరించింది. ప్రజలకే ప్రభుత్వం కావాలన్న లెనిన్ పార్టీ వారిని అణచివేయడానికి కూడా వారు వెనుదీయలేదు. ఎంతో విప్లవవాది అనుకున్న కెరన్‌స్కీయే ప్రజల నీవిధంగా దగా చేయడానికి పూనుకున్నాడు. అందుకనే విప్లవం! విప్లవం! అనేవారంతా విప్లవకారులని భ్రమపడకూడదు. ప్రజలతో, వారి కష్టసుఖాలలో యెవరు తోడునీడగా వుంటారో వారే నిజమైన విప్లవకారులు.

లెనిన్ మీద వారంటు జారీచేసింది, యీప్రభుత్వంకూడా. అతన్ని ఎట్లాగైనా పట్టుకుని కాల్చివేస్తే పీడ ఒదిలిపోతుందని చూస్తున్నారు, యీ నూతన ప్రభుత్వంలో ఆఫీసర్లు కొందరు. కాని గుమాస్తాలూ, చిన్న జీతగాళ్లూ లెనిన్ అంటే అభిమానిస్తారు. గుమాస్తాలే యీసంగతులన్నీ లెనిన్ స్నేహితుడైన స్వెర్డ్‌లోవ్‌కి తెలిపేరు. వెంటనే అతడు వీరి యింటికి వచ్చి ఉప్పు అందించేసేడు.

ఏమీ ఆలస్యం చేయకుండా బైలుదేరేడు, లెనిన్. ఏదో యిల్లాంటి అవసరం వస్తుందనే అతను చాల జాగ్రతగా తన కాగితాలన్నీ భద్రపరచే వుంచుకునేవాడు. అందుచేతనే లేడికి లేచిందే ప్రయాణమన్నట్లుగా లెనిన్ తక్షణం బైలుదేరేడు.

ఎందుకేనా మంచిదని, యెవరూ లెనిన్‌ను గుర్తుపట్ట కుండా వుండేటందుకై స్వెర్డ్‌లోవ్ తన పెద్ద పొడుగాటి రెయిన్‌కోటు (వర్షంలో పైన ధరించే పొడుగాటి కోటు) అతని భుజాలమీద కప్పేడు. రష్యా దేశంలో యెప్పుడూ వర్షాలూ, మంచు జల్లులూ కురుస్తుంటాయి. అందుకని రెయిన్‌కోటు అందరూ తొడుక్కుంటారు. ఇద్దరు స్నేహి తులూ మామూలుగా బాతాఖానీ కొడుతూన్నట్లుగానే వీధి లోకి వచ్చి నడుస్తూన్నారు. వీధిమలుపు తిరిగేసరికి గుభేల్ గుభేల్ మని ధ్వనిచేస్తూ, రెండు మోటారులారీలు ఎదురుగా వస్తున్నాయి. వాటినిండా మిలిటరీ ఆఫీసర్లూ, వైట్‌గార్డులూ తుపాకులు పట్టుకుని నిల్చుని వున్నారు. వైట్‌గార్డులంటే తెలుసా ? ఈ యింగ్లీషుమాటకి తెల్లసిపాయీలని అర్థం. లెనిన్ మొదలగు విప్లవకారుల పార్టీ పేరు బోల్షివిక్ పార్టీ; వారికి చిహ్నం యెరుపు; వారిది యెఱ్ఱజెండా; ఈ పార్టీ సిపాయీలు యెఱ్ఱని పట్టీలను భుజాలమీదా, గుండెలమీద, ఎఱ్ఱటి నక్షత్ర చిహ్నాని టోపీమీదా ధరించేవాళ్లు. అందు చేత వీళ్ళకి వ్యతిరేకులైన జమీందార్లూ, కోటీశ్వరులూ తమ సిపాయీలకి తెల్లటి పట్టీలను యిచ్చి ధరింపజేసేవారు.

తమ సైన్యాన్ని తెల్లసైన్యం—వైట్‌గార్డ్స్ అని పిలిచే వారు. ఇప్పుడు మీరు ప్రతిచోటా ఎర్రజెండా చూస్తూనే వుంటారు. దీని క్రింద నడుస్తూ, బీదలకోసం, కష్టజీవు లైన రైతుకూలీల కోసం పాటుపడే వాళ్ళందర్నీ మనం ప్రేమిస్తాం. రెడ్‌ఆర్మీ—ఎర్రసైన్యం అని వీళ్ళనే అంటాం. గుర్తుంచుకోండి.

రెండు లారీలూ సరాసరిగా బాణాల్లా వెళ్ళి లెనిన్ మేడ దగ్గర ఆగేయి. వైట్‌గార్డులు బిలబిల్లాడుతూ దిగి యింటికి నాలుగు వైపులా కాపలావేసి, కొందరు మేడమీదికి యెక్కేరు. తలుపు వేసివుంది. తుపాకీ మడమలతో తలుపు మీద దబదబా బాదేరు. లెనిన్ భార్య నాద్‌జ్యాదా తలుపు తీసింది.

"లెనిన్ యెక్కడ? రమ్మను!" అని అరిచేరు ఆఫీసర్లు.

"ఇంట్లో లేరు."

"ఎక్కడికి వెళ్ళేడు?"

"తెలియదు."

ఆమెను తోసుకుంటూ ఆ మూకంతా గదిలో ప్రవేశించి వెతకడం ప్రారంభించింది. సామానంతా చిందరవందర

చేసేరు. పుస్తకాలన్నీ విసిరి పారేసేరు. మంచాలక్రింద దూరిచూసేరు. ఓమూల్లో పెద్ద వెదురుబుట్ట వుంది. ఓఆఫీసరు కత్తిదూసి అట్టహాసంగా ఆ బుట్టలోకి గ్రుచ్చేడు! అక్కడినుంచి వంటయింట్లోకి దూరేరు. పనిమనిషి అనూష్కా యెత్తుపీటమీద కూర్చునివుంది. లోపలికివచ్చిన ఆఫీసరు వైపు కోపంగా చూసింది.

"వెతికించు! పొయిలోకూడా వెతికించు!"

"నోరుముయ్!" అని అరిచేడు ఆఫీసరు. లెనిన్ దొరక లేదని అసలే వాళ్ళు ఉడికిపోతూన్నారు. ఈ వెక్కిరింపుతో మరీ ఉడికిపోయేరు. కాని వంటింట్లో వెతకడానికి మొహం చెల్లలేదు, ఆ మగాళ్ళకి!

మళ్ళీ ముందుగదిలోకి వచ్చి లెనిన్ డ్రాయరుతీసి, అందులోని ఉత్తరాలన్నీ బైట పారేశారు. వాటిలో యేదైనా ఆచూకీ దొరక్కపోతుందా అని వాళ్ళ వూహ, పాపం!

ఓ ఉత్తరం సిపాయీల సంఘం వాళ్ళు రాసేరు.

"కామ్రేడ్ లెనిన్! మాసిపాయీలందరం నీఅడుగు జాడల్లో నడుస్తామని శపథం చేస్తున్నాం........"

మరోజాబు ఓపల్లెటూరి రైతుసంఘంవారు రాసింది.

"కామ్రేడ్ లెనిన్ చెప్పినట్లుగా మేమంతా వుంటాం. అతడొక్కడే నేడు మనదేశాన్ని ఉద్ధరించగలవాడని మానమ్మకం...."

ఉత్తరాలన్నీ 'యీధోరణిలోనే వున్నాయి. ఎన్నో సంఘాలనుంచి, వ్యక్తులనుంచి, దేశమన్నిమూలలనుంచీ, ప్రపంచంలో యెన్నో దేశాలనుంచీ వచ్చిన జాబుల్లో యిదే ధోరణి! ఏవో రహస్యాలుంటాయనుకున్న ఆఫీసర్లకు ఆశా భంగం కలిగింది. లెనిన్‌ని అంతా ప్రేమిస్తున్నారనేది తెలిసి వీళ్ళకి వళ్లు మరీ మండింది. కాగితాలు విసిరిపారేసి, అందర్నీ అరెస్టుచేయమన్నారు. నాద్‌జ్యాదా, అన్నా, మరియా చివరికి అనూష్కా, అందర్నీ అరెస్టుచేసి క్రింది చీకటి కొట్టులోకి నెట్టుకొచ్చేరు.

అట్టహాసంగా కత్తి ఝళిపిస్తూ, వాళ్ళని ప్రశ్నించడం ప్రారంభించేరు.

లెనిన్ ఎక్కడికి వెళ్లేడు?

తెలియదు.

ఎప్పుడు వెళ్లేడు, యింట్లోంచి?

ఉదయమే.

పట్టణంలోనికేనా?

తెలియదు.

కూడా యింకెవరున్నారు?

ఎవరూ లేరు.

ఏవైపు వెళ్ళేడు?

చూళ్ళేదు.

ఈ రకంగా చాలసేపు వాళ్ళందర్నీ కలిసీ, విడివిడిగానూ ప్రశ్నలు వేసేరు; కాని బైటికేమీ ఊడిపడలేదు. ప్రాణం విసిగి తిడుతూ, వాళ్ళందర్నీ వదిలిపెట్టి పోయేరు.

లెనిన్ సురక్షితంగా యింకో వీధిలో స్నేహితుడైన ఒక కార్మికుడి యింట్లో మకాం చేసేడు. లెనిన్ పట్నం లోనే వుంటాడని ఉద్యోగులు అంచనావేసి, వీధులూ, సందు గొందులూ ఆరోజంతా గాలించేసేరు. ఇళ్ళన్నీ వెతికేరు. ఇంక కార్మికపేటలు మిగిలేయి, అక్కడ ప్రతి యింటికీ సైనికుల్నీ, పోలీసుల్నీ కాపాలాపెట్టేరు. ఒక్క పిట్టనేనా తనిఖీ చేయనిదే వదలవద్దని ఆజ్ఞాపించారు.

లెనిన్‌కి తెల్లవారుఝామునే లేవడం అలవాటు. పొ

మూలుగా నేలేచి, కిటికీలోంచి వీధులోకి చూసేసరికి యిద్దరు సిపాయిలు తుపాకులతో కాపలా తిరుగుతూ కనిపించేరు. విషయం గ్రహించేడు, లెనిన్. దుస్తులు ధరించి, చేత్తో గొడుగు పట్టుకుని బైలుదేరేడు. ఆశీతలదేశంలో ప్రాతః కాలమే షికారు వెడతారు, చాలమంది. అందువల్ల తనను ఎవరూ అనుమానించలేరని లెనిన్‌కి తెలుసు.

లెనిన్ విధులోకి వచ్చి, సరాసరిగా సిపాయీలవైపే నడిచేడు. వాళ్ళని పలకరిస్తూన్నట్లుగా చిరునవ్వుచూచాను. అతని నడకలో, ముఖంలో, చూపుల్లో ఏమీ కంగారులేదు. "ఆఁ! ఈ మనిషి అనుమానించదగినవాడు కాదురా!" అన్నాడొకడు. "ఎవడో పొద్దున్నే షికారు పోతున్నాడులే" అన్నాడు రెండోవాడు. ఆపోలీసువాళ్ల తరుముతూన్న మనిషి యెప్పుడూ రొందరపడుతూ, కంగారుగా నడుస్తాడనీ, బిత్తరచూపులు చూస్తాడనీ, ముఖంలో భయం కనిపిస్తుం దనీ వాళ్ళ ఊహ! గొడుగు ఊపుకుంటూ, ప్రాతఃకాలపు యెండకు కళ్ళు చిగిలిస్తూ, చిరునవ్వుతో తమవైపే వస్తూన్న యితడెవరో అమాయకుడై వుంటాడు! అతనిని సిపాయీలు ఆటంకపరచలేదు.

లెనిన్ తిరుబడిగా వీధమ్మట గొడుగూపుకుంటూ షికారుకి వెడుతూనే వున్నాడు. నిండా పోలీసులతో లారీలు అతన్ని దాటి పోతూనే వున్నాయి. వీళ్ళంతా యింకా లెనిన్‌కోసం గాలిస్తూన్నారు!

ఆరోజు సాయంకాలం చీకటి పడేవరకూ లెనిన్ పెట్రోగ్రాడ్‌లోనే వున్నాడు. ఆరాత్రే అక్కడినుంచి రహస్యంగా మరోచోటికి తప్పించుకుని వెళ్ళిపోయేడు.

# రజ్‌లివ్ సరోవర తీరంలో

పెట్రోగ్రాడ్‌కి కొంచెం దూరంలో రజ్‌లివ్ అనే రైలు స్టేషన్ వుంది. స్టేషన్‌కి దగ్గరలోనే ఒక సరోవరం. దానిపేరు రజ్‌లివ్. రష్యాభాషలో "రజ్‌లివ్" అంటే 'వరద' అని అర్ధం. వేసవి రాగానే మంచు కరుగుతుంది. ఈసరస్సులోని నీరు పొర్లి చుట్టుప్రక్కల మైదానమంతా నీటిమయం ఐపోతూంటుంది. అంచేత యీ సరస్సుకి "రజ్‌లివ్" అని పేరు. మంచు కరగిపోగానే జూలై మాసంలో గడ్డిమొక్కలు భూమిని బ్రద్దలు చేసుకుని వస్తాయి. వేసవిలో గడ్డినికోసి, ఆరబెట్టి జాగ్రత్త పెట్టు

కుంటారు, రైతులంతా. శీతకాలంలో యిదే పశువులకి ఆధారం.

ఆ సరోవరంలోనే లెనిన్‌కి ఒక గడ్డివామిలో మకాం యేర్పాటు చేసేరు. కాని అది అంతగా నచ్చలేదు అతనికి. కొంచెం దూరంలోనే అడవి వుంది. దానిలో కొన్ని చెట్లు కొట్టి ఖాళీగా వుండేలా ఓ చిన్న మంచె వేసుకుని, అందులోకి మారేడు, లెనిన్. మంచెమీద గడ్డిపరుచుకుని, పైన కప్పుకూడా వేసుకున్నాడు. అతనికున్న సామానంతా ఓకుండ, టీ కెటిల్, చేగొడ్డలి, కొడవలి, చిన్న రంపం మాత్రమే.

అడవికీ, సరస్సుకీ దగ్గరలో ఓ చిన్న చెట్లతోపు వుంది. దానిలో ఓ దుంగమీద కూర్చుని చదువుకుంటూ, రాసుకుంటూ లెనిన్ కాలం గడిపేవాడు. చుట్టూవున్న చెట్లు అతనెవరికీ కనిపించకుండా దాచేవి. అతను మాత్రం చుట్టూ చాలదూరం చూడగలిగేవాడు. సరస్సుమీద ప్రయాణించేసే పడవలన్నీ లెనిన్‌కి కనిపించేవి. వెన్నెలలో ఆసరస్సుమీద పడవషికారు• వెళ్ళడమంటే లెనిన్ చాల యిష్టపడేవాడు. రోజూ చీకటి పడ్డాక ఓ చిన్నపడవ లెనిన్

వున్న తీరానికి వచ్చేది. జాబులూ, ఆనాటి పత్రికలూ, అవసరమైన కొన్ని వస్తువులూ తీసికొని రోజూ నమ్మకమైన ఓ స్నేహితుడు అక్కడికి వచ్చేవాడు.

ఉత్తరాలూ, పేపర్లూ చదువుకొని, అవసరమైన చోట్ల నీలిపెన్సిలుతో గుర్తులు పెట్టేవాడు, లెనిన్. స్టాలిన్ జర్జిన్స్కి, స్వెర్డ్‌లోవ్ మొదలైన వాళ్ళు పెట్రోగ్రాడ్ లోనే వుండి, ప్రజా ఉద్యమాన్ని నడుపుతూండేవాళ్ళు. వాళ్ళకి సూచనలు పంపుతూ, సలహాలిస్తూ వుండేవాడు, లెనిన్. సాయుధవిప్లవాన్ని యెప్పుడు, యెట్లా ప్రారంభించాలో ఆ జాబుల్లో రాసేవాడు. మొదట్లో టెలిగ్రాఫ్, టెలిఫోను స్టేషన్లు పట్టుకోవాలి; నీవా నదిమీది వంతెనలన్నీ ఆక్రమించి, సైన్యాల్ని కాపలా పెట్టాలి; విప్లవ నావికులున్న యుద్ధనౌకల్ని పట్టణం దగ్గరికి తెచ్చి నిలపాలి; యిట్లాగే యెన్నో సూచనలు వివరాలతో సహా పంపేవాడు.

ఈలోగా శత్రువులు లెనిన్‌కోసం దేశమంతా గాలించేసేరు. వాళ్ళపత్రికల్లో ఏమని రాసేవారో తెలుసా? లెనిన్ విమానంలో విదేశాలకి పారిపోయి వుంటాడని ఓపత్రిక; బహుశా సబ్‌మెరైన్‌లో సముద్రగర్భంలో దాగివుంటాడని

మరో పత్రిక ! ఇదీ వరస, ఇవన్నీ చదివి, లెనిన్ వాళ్ళ మూర్ఖత్వానికి నవ్వుకునేవాడు.

లెనిన్ రొట్టె టీతో కాలం గడిపేవాడు. అప్పుడప్పుడు మాత్రం సరస్సులో పట్టి తెచ్చిన చేపల్ని కూర చేసికొనే వాడు. అతడు దేన్నైనా చాల మితంగా తినేవాడు. ఓరోజున రజ్‌లివ్ గ్రామంలోని చిన్నపిల్లలు సరోవరంలో మంచి వాలుగచేపని పట్టుకున్నారు. లెనిన్ పిల్లలతో యెంతో ప్రేమగా వుండేవాడు. ఆ పిల్లలుకూడా లెనిన్ అంటే ఎంతో ప్రేమించేవాళ్ళు. వాళ్ళా చేపను తీసికొని, సంతోషంగా గంతులేస్తూ, లెనిన్ దగ్గరికి వచ్చేరు. నెగడి మండుతూంది. అప్పుడే ఆచేపను వండి, లెనిన్‌ను తినమని వేధించేరు. చివరకు తినేవరకూ వాళ్ళు ఊరుకోనేలేదు !

రోజూ గడ్డికోసి, ఆరబెట్టి, మేటిగా వేసేవాడు, తీరిక సమయాల్లో. ఓరోజున ఆప్రాంతంలోని ముసలి రైతొకడు లెనిన్‌దగ్గరికి వచ్చి ఆ వేసవిలో కోసినగడ్డంతా తనకు బేరం యిమ్మని ప్రాధేయపడ్డాడు. లెనిన్ నవ్వుతూ అట్లాగే కానిమ్మని ఒప్పుకున్నాడు. ఈసంగతి తెలిసిన అతని మిత్రులు చాల భయపడ్డారు. వాడెవడో గూఢచారి అయి

వుంటాడని. ఏమీ భయంలేదని లెనిన్ వాళ్ళకెంతో నచ్చ చెప్పాల్సి వచ్చింది!

లెనిన్ ఏపనిచేసినా ఎంతో సహజంగా వుండేది. అదే ఆయన ప్రత్యేకత. పిల్లలలో పిల్లవాడుగా, రైతుల్లో రైతుగా మసలు కొనేవాడు!

## ఫైర్ మన్

రజ్‌లివ్‌నుంచి వర్షాలమూలంగా లెనిన్ మకాం యెత్తేయ వలసి వచ్చింది. రాత్రివేళ రహస్యంగా కొద్దిదూరంలో వున్న 'ఉదెల్నయా' స్టేషన్‌కి చేరేడు. 71 నంబరు ట్రెయిన్ వచ్చే వేళ అయింది. అందులో యింజను డ్రైవరుతో అదివరకే మాట్లాడి యేర్పాటు చేసేరు. ఇంజన్‌ను స్టేషన్ దాటించి కొంచెం ముందుగా చీకట్లో ఆపడానికీ, అక్కడే సడిలేకుండా లెనిన్ యింజన్‌లోనికి రావడానికీ నిర్ణయం.

ఇంజను డ్రైవరు అదివరకెన్నడూ లెనిన్‌ను చూడలేదు. అతన్ని బాగా తెలిసివున్నవాళ్లే గుర్తుపట్టలేరు. ఇంజన్ ఆగింది. ఫైర్‌మన్ మెల్లిగా దిగి, చీకట్లో మాయమై

పోయేడు. లెనిన్ శుభ్రంగా బోడి చేయించుకుని, విగ్గు పెట్టుకున్నాడు, జుట్టు నుదురంతా కప్పేస్తూంది. దానిమీద ఫైర్‌మన్ ధరించే నల్లటి టోపీ పెట్టుకుని, మామూలుగా పనిలోకి వచ్చేవాడిలాగే, యింజన్ యెక్కి వచ్చి, షోవెల్ తీసుకొని నిలుచున్నాడు. అతని ధోరణి చూసి యితడే లెనిన్ అయివుండాలని డ్రైవర్ అనుకున్నాడు.

ఇంజన్ గదిలో డ్రైవరూ, అసిస్టెంటూ, ఫైర్‌మనూ ముగ్గురే వున్నారు. ఫైర్‌మన్ అంటే యెవరో కాదు, మన లెనినే! యుద్ధం రోజులు అవి. బొగ్గు ఉత్పత్తి చాల తగ్గిపోయింది. అంచేత రైలు యింజన్‌లో కట్టెలు మంటబెడుతున్నారు. ఫర్నేస్ (పెద్దపొయ్యి) కి ఓప్రక్కని అరపమీద కట్టెలు పడేసి, వేడికి ఆరేక వాటిని మెల్లిగా ఫర్నేస్‌కి అందించేవాడు అసిస్టెంటు. కొంతసేపయేక బొగ్గులు ఊచతో కదిపితే బాగా మండుతాయి.

లెనిన్ కోటు విప్పి, మేకుకి తగిలించి, చొక్కాచేతులు పైకి తీసి, పనిలోకి సరాసరిగా దిగేడు. చెమ్మగావున్న కట్టెల్ని అరపమీద పెట్టి, ఆరేక మంటలోకి విసురుతూన్నాడు. షోవెల్‌తో బొగ్గులు కదిపి, బాగా మండేటట్లు

చేస్తూంటే తనబరువు తగ్గింది కదా అని అసిస్టెంటు సంతోషంగా 'పైపు' తీసి వెలిగించేడు. తీరిగ్గాకూచుని, పొగవదులుతూ, కొత్త ఫైర్‌మన్‌కేసి తృప్తిగా చూస్తూన్నాడు!

ట్రైను బైలో-ఆస్ట్రోవ్ స్టేషను చేరింది. ఆ స్టేషను దాటితే ఫిన్‌లాండుదేశం. అక్కడ బండిలో జనాన్నందర్నీ పూర్తిగా పరిశీలిస్తున్నారు, ఉద్యోగులు. మిలిటరీ, పోలీసు ఆఫీసర్లు అట్టహాసంగా ప్లాట్‌ఫారంమీద తిరుగుతున్నారు. ప్లాట్‌ఫారం మీద బండి ఆగ్గానే పోలీసులు పెట్టెల్లో చొరబడ్డారు. ఇంజను డ్రైవరు యిదంతా చూస్తూనే వున్నాడు. గబగబా దిగి 'కప్లింగుటు' ఊడదీసేడు. నీళ్లగొట్టం దగ్గరికి ఇంజనును నడిపించుకుపోయి, అక్కడే కాలయాపన చేసేడు. స్టేషనులో మూడోసారి గంట కొట్టేవరకూ నీళ్ళపంపు దగ్గిరే వుంది, యింజన్. ఒగుర్చుకుంటూ పరుగెత్తుతూ, యీల ఊపుతూ వస్తున్నాడు, గార్డు. బైలుదేరే టైం అయి పోయింది. అప్పుడు యింజనును మెల్లిగా వెనక్కి తీసుకొచ్చి, పెట్టెలకి తగిలించేడు, డ్రైవరు. గార్డ్ యీల ఊది, పచ్చజెండా ఊపేడు.

ఇంజను ఇంతసేపు నీళ్ళపంపుదగ్గిర ఆలస్యం చేయడం

చూస్తూనే వున్నాడో పోలీసు ఆఫీసర్. అతనికి అను మానం కలిగిందిలావుంది, యేదో సంజ్ఞచేసేడు, సోల్జర్లకి. ఓగుంపుగుంపంతా ఇంజనువైపు పరుగెత్తుకుని వస్తున్నారు. పాపం, వాళ్ళు పరెగెత్తడమేగాని, అప్పుడే కై( ! మంఘా యింజను యీలవేసి, ఆవిరవదలి బైలుదేరింది. ఫుల్‌స్పీడ్ ఇచ్చేసి, కేబిన్‌లోంచి వీళ్ళనిచూసి వెక్కిరించేడు, డ్రైవరు.

ఎంతో శ్రమపడి పరుగెత్తి వచ్చిన పోలీసులు నెత్తిని గుద్దేసుకు పోవాల్సివచ్చింది.

## రేగుపళ్లు

రష్యా సరిహద్దుకు దగ్గరే ఫిన్‌లాండ్‌లో రెండు పెద్ద చెరువు లున్నాయి. ఒకదాని పేరు నల్లచెరువు. దీనిచుట్టూ అరణ్యం దట్టంగా వుంటుంది. వెలుతురు సోకనే సోకదు. అందుకని యీ సరస్సులో నీళ్ళుకూడా నీడల్లో నల్లగానే వుంటాయి. రెండోదానిచుట్టూ అంతా వెల్లడిగా వుంటుంది. దాని నీటిమీద సూర్యకిరణాలెప్పుడూ పడుతూ తళతళా మెరసి పోతూంటాయి. దీన్ని తెల్లచెరువు అంటారు, అక్కడివాళ్లు. ఈచెరువునీళ్లు ఎంతో స్వచ్ఛంగా వుంటాయి.

అడుగునివున్న చిన్న చిన్న గులకరాళ్ళుకూడా స్పష్టంగా కనిపిస్తాయి.

ఈ రెండు చెరువులకీ మధ్య అడవికి దగ్గిరలో చిన్న కుటీరం వుంది. దానిలో 1917 లో ఫిన్నిష్ కార్మికు డొకడు కాపురం వున్నాడు. ఓరోజున అతడు తనతోకూడా నూతన వ్యక్తి ఒకణ్ణి తీసుకుని వచ్చేడు. భార్యతో ఆగంతకుని పరిచయం చేసేడు.

"నాస్నేహితుడు, కాన్‌స్టాంటిన్ పెట్రోవిచ్ ఇవానోవ్."

అప్పటినుంచీ ఇవానోవ్‌కూడా ఆకుటుంబంతో బాటుగా అక్కడే వుండిపోయేడు.

ఆ కార్మికునికి యిద్దరు కొడుకులు. పెద్దవానికి ఎనిమిదేళ్లు; చిన్నవాడికి ఆరేళ్లుంటాయి. వీళ్ళతో ఇవానోవ్ నేస్తం కట్టేసేడు. వాళ్లకి రష్యా భాష రాదు. ఆగంతకునికి ఫిన్నిష్‌భాష రాదు. అయినా ఇదేమి వాళ్ళ నేస్తానికి అడ్డు కాలేదు. వీళ్లు ముగ్గురూ అడివిలోకి వెళ్ళి రేగుపళ్లూ అవీ పోగుచేసు కొచ్చేవాళ్ళు. భాష రాకపోయినా రేగుపళ్ళను గూర్చి యేదో మాట్లాడాలని ప్రయత్నించేవాళ్లు, ఆ చిన్న పిల్లలు. తరచుగా వాళ్లు అనేమాట లేమిటో తెలుసా?

"పునై సెర్! పునై సెర్ మర్జర్!"

ఈమాటల కర్థం "రేగిపళ్లు! ఎర్రటి రేగిపళ్లు!" అని.

గడ్డిలో యెర్రటిపండును చూడ్డంతోనే "పునై సెర్! పునై సెర్ మర్జర్!" అనేవాడు ఇవానోవ్. మాటైతే అదే కాని, అతని ఉచ్చారణ అదోమాదిరిగా వుండేది. కుర్రవాళ్లు కిలకిల్లాడుతూ నవ్వేవాళ్లు అతనిమాటలకి.

రేగిపళ్లేరుకొని, అదీ ఇదీ చూస్తూ, చెరువుదగ్గిరికి చేరే వారు ముగ్గురు. బాగా యెండగావున్న రోజునైతే చెరువులో దిగి, యీతకొట్టేవాళ్లు. ఈదేటప్పుడుకూడా ఇవానోవ్ టోపీ తీసేవాడుకాదు. అతనికిబాగా యీతవచ్చు. చెరువు యీగట్టు నించి ఆగట్టుకి యీదేవాడు. టోపీ యెందుకు తియ్యడని అడుగుదామనుకొనేవాళ్లు, ఆపిల్లలు. కాని యెట్లా అడగాలో వాళ్ళకి తెలియదుగా! పిల్లలకీకూడా యీత నేర్పేవాడు, ఇవానోవ్.

ఇంటికొచ్చేక టేబిల్‌దగ్గిర కూచుని గబగబా రాసేసే వాడు యేమిటోకాని, అతడు. ఇవానోవ్ అక్షరాలు చీమల్లా చిన్నవిగా వుండేవి. రోజూ యెన్నో టావులు రాసేస్తూండే వాడు. రాసేటప్పుడుకూడా పిల్లలు ఇవానోవ్‌ను పలకరించి,

అతనితో ఆడుకోవాలనుకొనేవాళ్ళు. అప్పుడు వాళ్ళమ్మ అనేది :

"ఒరేయ్! మాట్లాడించకండి. పనిచేసుకుంటున్నప్పుడు కదిలించకూడదురా. ఇట్లారూచోండి !"

వాళ్లా రామలక్ష్మణుల్లాగ కూర్చుని, అతనికేసి ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి చూసేవాళ్ళు.

మర్నాడుదయమే చల్దితిని, బట్టలు కట్టుకుని, చేతిలో ఖాళీబుట్ట పట్టుకొనివచ్చి "పునైసెర్!" అంటూంటే, ఇవానోవ్ కూడా నవ్వుతూ జవాబిచ్చేవాడు :

"మీరు పునైసెర్ అంటే తప్పుతుందా? అట్లాగే నడవండి!"

సాయంత్రం వాళ్ళనాన్న పనిలోనుంచి యింటికి వచ్చేక, అంతా భోజనానికి కూర్చునేవాళ్ళు. పట్టణంలో జరుగుతున్న సంగతులూ, లెనిన్ సంగతులూ, ఆయన పార్టీని గురించీ వాళ్ళనాన్న చెప్పేవాడు. వింటూ, జుట్టుమీద మెల్లిగా చెయ్యిపెట్టుకుంటూ, కూర్చునేవాడు, ఇవానోవ్.

ఇవానోవ్ అక్కడెంతో కాలం వుండలేదు. ఓ రోజున పట్నాన్నుంచి యిద్దరుకార్మికులు వచ్చేరు. వాళ్ళతో అతను బైలుదేరి వెళ్ళిపోయేడు.

నాలుగు రోజులకి వాళ్ళనాన్న వెళ్లేడు, పెట్రోగ్రాడ్‌కి. అక్కడ మళ్ళీ యుద్ధం జరుగుతూందని విని, వాళ్ళమ్మ చాలా కంగారు పడింది. కాని యేమి ప్రమాదం జరగలేదు. వాళ్ళనాన్న క్షేమంగానే యింటికొచ్చేడు, కొన్నిరోజులుకి.

సోవియట్ ప్రభుత్వం యేర్పడిందిట. బోల్షివిక్కులే నెగ్గేరని అందరికీ తెలిసిపోయింది. లెనిన్ అనే ఆయన క్రింద కొత్త ప్రభుత్వం నడుస్తూంది. జమీందారుల భూమంతా రైతులికి పంచిపెట్టేరు. కార్మికులకి జీతాలు పెరిగేయి; ఫాక్టరీలుకూడా వాళ్ళే నడుపుకుంటున్నారుట కూడాను!

వాళ్ళనాన్న వచ్చేక, ఓరోజున లెనిన్ బొమ్మ పెట్టె లోంచి పైకి తీసి వాళ్ళకి చూపించేడు.

"ఇవన్ని గుర్తు పట్టగలరా?"

"జుట్టూ అదీ పెట్టుకుని వచ్చేడప్పుడు. పాపం చిన్న పిల్లలు, వాళ్ళేం గుర్తిస్తారండీ!" అంది, వాళ్లమ్మ.

"ఆఁ! చెల్లో యీదేటప్పుడు టోపీ యెందుకు తీసేవాడు కాదో తెలిసిందిలే!" అని బిగ్గరగా అరిచేడు, అన్న.

"నేనూ చెప్పుకోగలను, నాన్నా!" అన్నాడు తమ్ముడు.



హఠాత్తుగా యిద్దరు పోలీసులువచ్చి. లెనిన్ రెండుచేతులు పట్టుకున్నారు.
....ఏదో కాగితం దొరికితే.... సైబీరియాకి పంపి....

48 (A)



లెనిన్ కుడిచెయ్యెత్తి మాట్లాడ్డం ప్రారంభించేడు.
"కామ్రేడ్స్! మీకు సంక్రమించిన అధికారాన్ని మీరే నిలబెట్టుకోవాలి!"

48 (B)

లెనిన్ మారువేషం బాగానే వేయగలడు. కాని అతని కళ్లు ఆనమాలే. ఆ కళ్ళల్లో యేదో ప్రత్యేకత వుంది. చిన్న పిల్లలకి కూడ అది తెలుస్తుంది. ఒక్కళ్ళకి మాత్రం తెలియదు. ఎవరికో చెప్పుకోండి, చూద్దాం?

# ముసలి రైతు

1917 అక్టోబరు విప్లవం జయప్రదంగా ముగిసిన రోజులవి. పెట్రోగ్రాడ్ పట్టణమంతా కార్మికులకీ, సైనికులకీ స్వాధీనమై పోయింది. విప్లవశత్రువులు ఊరుకోలేదు. వాళ్లూ తమబలాన్ని కూర్చుకుని యెదురుదాడులు సాగిస్తూనే వున్నారు. కూలీరైతుల సైన్యం వారితో రాత్రిం బగళ్ళు యుద్ధం చేస్తూంది. రష్యా అంతా యీమూలనుండి ఆమూలకి జ్వాలాతోరణంలా అంటుకుంది. లెనిన్ పెట్రోగ్రాడ్ పట్టణంలోనే వుండి విప్లవనౌకను చుక్కానిపట్టి నడిపిస్తున్నాడు.

సైబీరియాలో ఓచిన్న పల్లెటూళ్లో ఒక ముసలిరైతు వున్నాడు. లెనిన్ సంగతి అతనూ విన్నాడు. ఓసారి

లెనిన్‌ను చూసి, తన కష్టసుఖాలు అతనితో చెప్పుకుని, సలహా అడుగుదామని నిశ్చయించుకుని, పెట్రోగ్రాడ్‌కి బైలుదేరేడు. సైబీరియానుంచి పెట్రోగ్రాడ్‌కి ఎంతో దూరం. రైళ్లుకూడా నడవడం లేదు. దారిలో మజిలీలు చేసుకుంటూ, కాలినడకనే ఎల్లాగో పెట్రోగ్రాడ్ చేరుకున్నాడు.

అక్కడ వీధుల్లో కార్మికులు తుపాకులుపట్టుకుని గస్తీ తిరుగుతూన్నారు. సైనికదళాలు బ్యాండులతో అటూయిటూ వెడుతూన్నాయి. ప్రతీ దళానికీ ముందు ఓ పెద్ద ఎర్రజెండా, సుత్తీ - కొడవలీతో వున్నది మోసుకుని ఒక సైనికుడు నడుస్తున్నాడు. ప్రజలంతా మాంచి హుషారుగా వున్నారు. యుద్ధం మూలంగా నానాయిబ్బందులూ పడుతూన్నా, వీళ్లకీ హుషారేమిటి చెప్మా? అని ముసలిరైతుకి సంశయం కలిగి, కాపలా కాస్తున్న యెర్రసైనికుడి దగ్గిరికి వెళ్లి అడిగేడు.

"ఏమిటి నాయనా, యీ అడావుడి?"

"ఎరగవు తాతా? రాజ్యం మనదైపోయింది. చక్రవర్తినీ, ఆయన ఉద్యోగస్థుల్నీ ఖైదులో పెట్టేశాం. బీద

ప్రజలదే యిప్పుడు రాజ్యం అంతా.” అన్నాడు, ఎఱ్ఱ సైనికుడు.

“మావూరు జమీందారు ఏమయేడు? మాచెడ్డబాధ పడి పోతూన్నాం, బాబూ, పీడ యెప్పుడు వదులుతుందోగాని.”

“మీ జమీందారు సంగతి నాకు తెలియదు. కాని, జమీం దార్లంతా నగలూ, బంగారం పట్టుకుని విదేశాలకి పారి పోయేరు.”

“సాధ్యంగాదు కాని లేకపోతే భూములుకూడా పట్టుకు పోయేవాళ్లే!” అంటూ రైతు ముందుకు సాగేడు. లెనిన్ యెక్కడుంటాడని అడుగడుక్కీ అడుగుతూనే వున్నాడు. ఎవరు చెప్పినా ఒకటే మాట.

“స్మోల్నీ యిన్‌స్టిట్యూట్‌లో వుంటాడు, లెనిన్..”

పట్నం అంతా తిరిగి తిరిగి యెట్లాగైతేనేం ఆభవనం దగ్గిరికి వచ్చేడు. అదొక బ్రహ్మాండమైన రాజప్రాసాదం. దాని యెదట పెద్దపెద్ద సెగళ్ళు మండుతున్నాయి. సైని కులూ, నావికులూ చలికాచుకుంటున్నారు. కొందరు మర ఫిరంగుల దగ్గిర నిలుచుని వున్నారు. అదే స్మోల్నీయిన్‌స్టి ట్యూట్. చప్టామీద కాపలానిల్చున్న ఓ సిపాయీ దగ్గిరికి

వెళ్ళి, లెనిన్ ఎక్కడ? అని అడిగేడు, తాత. ఎగాదిగా చూసి, సిపాయీ చిరునవ్వుతో అడిగేడు :

"ఎందుకు తాతా, లెనిన్ !"

"ఎందుకేమిటి నాయనా? మా రైతుల గోడు వినిపించుకుందామని వచ్చేను; ఆ మహారాజుని ఓమాటు కళ్ళచూసి పోతా."

"అక్కడ కమాండెంటున్నాడు. ఆయనదగ్గర 'పాస్' తీసికొని వెళ్ళాలి. అట్లా వెళ్లు తాతా !"

మేడమెట్లనిండా బురదే. జర్రుమని జారుతూన్నాయి. జాగ్రతగా పైకి వెళ్లేసరికి చాలమంది వరసగా "క్యూ"లో నిల్చుని వున్నారు. అందరూ ఒకసారే గుమిగూడితే గందరగోళమేగాని పని జరగదు. అంచేత ఒక్కొక్కరే వరసగా పనిసాగిపోతుంది. ఆవరసకే ఇంగ్లీషులో 'క్యూ'అంటారు. రైలు స్టేషన్లలోనూ, సినిమాహాలు దగ్గరా, రేషన్ షాపుల్లోనూ మీరు "క్యూ"లో యెప్పుడూ నిలబడలేదూ ?

కమాండెంటు ఒక్కొక్కరికే 'పాస్' లు రాసి యిస్తున్నాడు. ఆయన తుపాకి పట్టుకున్నంత నేర్పుగా కలం పట్టుకోలేడని తోస్తుంది. రాత చాల మెల్లిగా, కష్టంగా

వుంది. ఒక్కో ప్యాస్ రాసేసరికి చాలా ఆలస్యం అవు తూంది. కలం క్రింద పడిపోతుందేమోనని భయపడుతూ న్నట్లుగా అయిదు వ్రేళ్లతోనూ గట్టిగా పట్టుకున్నాడు!

కొంచెంసేపట్లో తాతకి పాస్ దొరికింది. బైలుదేరేడు, అందరితోనూ. ఓచోట తుపాకులన్నీ గుట్టగుట్టలుగా పేర్చి వున్నాయి. పొడుగాటి సిపాయీ ఒకడక్కడ నిలుచుని అందిస్తూంటే కార్మికులూ, వాలంటీర్లూ తీసికొని, రశీదుమీద వేలుముద్రవేసి వెళుతున్నారు. దళాలుగా యేర్పడి, ఒకణ్ణి నాయకుడిగా యెన్నుకుని, కదంతొక్కుకుంటూ, యుద్ధ రంగానికి హుషార్‌గా వెళ్ళిపోతూన్నారు. అంతా హడా విడిగావున్నా, క్రమశిక్షణతో జరిగిపోతూంది. పట్నంవెల పల యుద్ధం జరుగుతూంది. ఫిరంగిధ్వనులు యెడతెగ కుండా గుబులుగా వినిపిస్తూనే వున్నాయి.

పొడుగాటి సిపాయీని అడిగేడు తాత, 'లెనిన్ యెక్క డుంటాడని' తాతనిచూసి అతను చిరునవ్వు నవ్వేడు.

"అరవై యేదో నంబరుగదిలో వుంటాడు. వెళ్లతాతా!"

ఆగదిదగ్గరికి వెళ్లేడు. అక్కడ యిద్దరు రెడ్‌గార్డ్సు కాపలావున్నారు. వాళ్లని అడిగితే "లెనిన్ పెద్దహాల్లో ఉప న్యాసం యిస్తూన్నాడు. వెళ్ల" మన్నారు.

వసారా వెంబడే నడుస్తున్నాడు. అదెంతపొడుగుందను కున్నారు! ఉండదూ, చక్రవర్తిగారి భవనంమరి! ఇప్పుడది కూలీలూ, సిపాయీలూ స్వాధీనంచేసుకుని, మీటింగులు పెడుతున్నారు! వెళ్ళి వెళ్ళి, పెద్దహాల్లో ప్రవేశించేడు. అక్కడంతా గోలగావుంది. అక్కడేంజరుగుతూందో తెలియ లేదు, తాతకి. కేకలువేస్తున్నారు, చప్పట్లు కొడుతూన్నారు, టోపీలు యెగరేస్తున్నారు. మామూలుదుస్తుల్లోవున్న కార్మి కులు, పెద్ద పెద్ద ఉన్నికోట్లు తొడుక్కున్న సిపాయీలు, ఊదారంగు చొక్కాలు తొడిగిన నావికులూ, రంగురంగు లుగా వింతగావుంది, హాలంతా.

"లెనిన్! కామ్రేడ్ లెనిన్! లెనిన్‌కీ జై!"

మునివేళ్ళమీద లేచి, మెడరిక్కించి చూసేడు, తాత. అవతలవైపున వేదికమీద నిల్చునివున్నాడు, లెనిన్. జై జై ధ్వానాలు ఎంతకీ తగ్గవేం? అని చిరాకుపడుతూన్నట్లుగా వున్నాడు. ఒక్కమాటుండి, చిరునవ్వునవ్వి, కుడిచెయ్యెత్తి మాట్లాడ్డం ప్రారంభించేడు.

"కామ్రేడ్స్! కూలీ రైతుల విప్లవం జయప్రదంగా సాగుతూంది. అధికారంఅంతా కష్టజీవులదే అయింది. మన

బోల్షివిక్ పార్టీ మొప్పుడూ దీన్నే వాంఛించింది. మీకు సంక్రమించిన యీ అధికారాన్ని, మీరే నిలబెట్టుకోవాలి..........”

లెనిన్ మాట్లాడ్డం ప్రారంభించేసరికి గోలతగ్గింది. అంతా నిశ్శబ్దంగా వింటున్నారు. చీమ చిటుక్కుమంటే వినిపించేలావుంది. హాల్లోకి జనం వస్తూనేవున్నారు. అంతా నిండిపోయింది. వసారాలోకూడా జనమే. లెనిన్ మాట్లాడేదంతా విన్నాడు, తాత. రైతుల్నిగూర్చి, భూమినిగూర్చి అంతా చెప్పేసేడు, లెనిన్.

ఏంచెయ్యాలోకూడ చెప్పేడు. హాలంతా ఒక్కగావుంది. అందరూ చెమటతో తడిసిపోయేరు. అయినా ఒక్కరూ కదలలేదు. మంత్రముగ్ధుల్లాగ లెనిన్ మాట్లాడుతూన్నంతసేపూ, ఏకాగ్రంగా అతనివై పే చూస్తూ, వింటున్నారంతా. లెనిన్ ఉపన్యాసం ముగిసింది, మళ్లీ జయజయధ్వానాలతో భవనం దద్దరిల్లింది.

తాతకి తనగ్రామం జ్ఞాపకంవచ్చింది. లెనిన్ చెప్పిందంతా అక్కడవాళ్ళకి చెప్పాలి. ఇక్కడుంటే ఎట్లాగ? త్వరత్వరగా బైటికివచ్చి, మెట్లు దిగుతూంటే, వెనకనించి

యెవరో భుజంతట్టేరు. తిరిగిచూస్తే స్మోల్నీదగ్గర కాపలా నిల్చుని తనకు సమాధానంచెప్పిన యెర్రసైనికుడు.

"తాతా ! లెనిన్‌తో మాట్లాడేవా ?"

"ఆచ్చే ! మారైతులసంగతంతా లెనిన్‌కి యిదివరకే తెలుసు. ఇంక నేను చెప్పవలసిందేమీలేందే! మేము ఏం చేయాలోకూడా చెప్పేశాడు. మావాళ్ళందరికీ చెపుదామనే తొందరగా వెడుతున్నాను."

ఆ ముసలిరైతు తనగ్రామంచేరేక లెనిన్ చెప్పిందంతా గ్రామస్థులమీటింగులో చెప్పేడు. వాళ్ళంతా రైతుసంఘం పెట్టుకున్నారు. దాన్నే 'సోవియటు' అంటారు, రష్యా భాషలో. అప్పటినుంచీ గ్రామంలోని పెత్తనంఅంతా రైతు సంఘానిదే అయింది. జమీందారు పారిపోయేడు. ఎక్కడికో తెలియదు, ఎవరికీ !

# వైమానికుడు

అక్టోబరు విప్లవం అయిపోయేక, సోవియటుప్రభుత్వం యేర్పడింది. ప్రజల మంత్రివర్గాలు అధికారంలోకి వచ్చేయి. ఏమూర్కో, ఎవరికి, యేకష్టంవచ్చినాసరే, యిప్పుడు సరాసరిగా మంత్రిగారి ఆఫీసుకువెళ్ళిపోయి చెప్పడమే. మంత్రులకీ, వాళ్ళ ఆఫీసుల్లో పనిచేసేవాళ్ళకీ తెరిపివుండేదేకాదు.

అప్పటికి యింకా యుద్ధం ఆఖరుకాలేదు. రైతులకీ, కూలీలకీ సైనికతరిఫీదుయివ్వడానికి దేశం నాలుగుమూలలా యెన్నోస్కూళ్లు యేర్పాటుచేసేరు. ఫిరంగులు కాల్చడం, విమానాలు నడపడం అన్నీ నేర్పుతారు, వాటిల్లో. వోల్గానదీ తీరంలో ఓ పల్లెటూర్లో విమానాశ్రయం ఒకటి వుంది. అక్కడ యెన్నో విమానాలుండేవి. ఆ చుట్టుపట్ల రైతు యువకులంతా అక్కడికివచ్చి విమానాల్ని నడపడం నేర్చు కునేవారు.

విమానాలు నడపడంఅంటే మాటలుకాదు. ఎన్నో శాస్త్రాలు తెలియాలి. విమానం నడిపేవాళ్ళని 'పైలట్' అంటారు. పూర్వకాలంలో రథం నడిపేవాణ్ణి 'సారధి'

అన్నట్టే. ఈ పైలట్లుగా రైతుయువకుల్ని తయారుచేయాలని సోవియట్‌ప్రభుత్వం అనుకుంది. అయితే నేర్పేవాళ్లెవరు? అదివరకు చక్రవర్తిసైన్యాల్లో పనిచేసిన ఆఫీసర్లే యీపనికి సమర్థులు; కాని, వాళ్లు ప్రజలకి శత్రువులు. వీళ్లకి నేర్పడం ఎంతమాత్రం వాళ్లకిష్టంలేదు. విధిలేక 'బలవంతపు బ్రాహ్మణార్థం'గా ఒప్పుకోవాల్సి వచ్చింది. సమయం దొరికితే విమానాలు తీసికొని యే ధనికప్రభుత్వం వున్న దేశానికో పారిపోవాలని కనిపెట్టుకుని వుండేవాళ్లు. ఇది తెలిసే, ఆరైతుయువకులు నిరంతరం విమానాలకి కాపలా వుండేవాళ్లు.

ఇదంతా పైవాళ్లకితెలిపి, సలహా తీసుకోవాలని ఒక యువకుడు బైలుదేరేడు. లెనిన్‌గ్రాడ్ చేరుకున్నాడు. చెప్పడం మరిచిపోయేను! విప్లవం జయంపొందేక పెట్రోగ్రాడ్‌కి లెనిన్‌గ్రాడ్ అని పేరెట్టేరు. దీనికి అర్థం 'లెనిన్ నగరం' అని. 'పెట్రోగ్రాడ్' అంటే 'పీటర్‌నగరం' ఆ నగరాన్ని నిర్మించిన 'పీటర్' చక్రవర్తి పేరిట పిలువబడేది, అంచేతనుమా. యువకుడు సరాసరిగాపోయి లెనిన్‌తో మాట్లాడదామనుకున్నాడు. కాని, యింత చిన్నవిషయానికి లెనిన్

టైము వృథాచెయ్యడం యెందుకని, లెనిన్‌భార్య 'నాద్ జ్యాదా'తో చెప్పాలని నిశ్చయించేడు. లెనిన్‌భార్య అని కాదుసుమా, ఆమెతోచెప్పడం! నాద్‌జ్యాదా విద్యాశాఖలో బాధ్యతవహిస్తున్న ఉద్యోగికదాను. విద్యాబోధనకి సంబంధించిన యీవిషయాన్ని ఆమెతో చెప్పాలని ఆయువకుని అభిప్రాయం.

ఆ సమయానికి నాద్‌జ్యాదా ఆఫీసులోలేదు. అంచేత ఆమె కార్యదర్శి 'జినైదా' దగ్గరికి యీ యువకుని తీసికొని వెళ్ళేరు. ఆమెతో సవిస్తరంగా పరిస్థితంతా చెప్పేడు.

"మా మేష్టర్లమీదే మేం నిఘాపుంచాల్సివస్తోంది. ఎంత అసంబద్ధంగావుంటుందో ఆలోచించండి! నేర్చుకొనే పని ఆష్టాపుంచి, రాత్రింపగళ్ళ విమానాల్ని కాపలాకాయాల్సి వస్తోంది. పైగా ఆ మేష్టర్లూసరే, మాకేమైనా వచ్చిపోతుందేమోనని చూస్తున్నట్లుంది! ఇవీ పరిస్థితులు. ఏదో ఒకటి త్వరగా ఆలోచించకపోతే లాభంలేదు."

జినైదా ఆలోచించింది. ఏమీ పాలుపోలేదు. ఈబాధ్యత తనమీదెందుకనుకుని, అంది;

"సరేగాని, కామ్రేడ్! ఈ విషయాన్ని ఆలోచించాల్సింది, యుద్ధశాఖవాళ్లు. నువ్వొకసారి ఆ ఆఫీసులోచెప్పు."

అతనికీ అదే సబబుగా తోచిందిలావుంది. ఆమెవగ్గర సెలవుతీసికొని బైలుదేరేడు.

జినైదా ఆరోజునే లెనిన్‌ను కలుసుకున్నప్పుడు మాటల సందర్భంలో యీ యువకుని విషయం చెప్పింది. రైతులు, కూలీలు, సిపాయీలు యేమనుకుంటున్నారా? అని లెనిన్ యెంతో ఆసక్తితో వుంటాడని ఆమెకి తెలుసు. ఇల్లాంటి వాళ్ళతో మాట్లాడడానికి యెంతపనిలోవున్నా ఓక్షణం తీరిక చేసుకుంటూంటాడు. ఇప్పుడూ ఈవిషయం వినగానే అతనికి కుతుహలం కలిగింది.

"జినైదా! అతను వోల్గా ప్రాంతాన్నుంచేనా వచ్చేడన్నావు! ఏగ్రామమో అడిగేవా? విమానాశ్రయం వున్నదైతే, బహుశా........ఆఁ! 'శరతోవ్' ఐవుంటుంది! అతనిపేరేమిటన్నావు?"

"నేనివేమి కనుక్కోలేదు" అంది, జినైదా.

"విమానాశ్రయాన్నిగూర్చి వివరాలన్నీ రాయించి, స్టేటుమెంటు తీసికోవాలి. అతను చదువువచ్చినవాడేనా?"

"నాకు తెలియదు, మరి."

"అతన్నెక్కడికి పంపేవు? యుద్ధశాఖ కార్యాలయా

నికా ? ఏయుద్ధశాఖ ? జిల్లాశాఖా? రాష్ట్రఆఫీసుకా ? యూని యన్ శాఖకా ?"

లెనిన్ ప్రశ్నలవర్షం కురిపిస్తూంటే, జినైదా చాలా చిన్న బుచ్చుకుంది. తానేమి కనుక్కోకండా అతన్ని పంపించివేసి నందుకు సిగ్గుపడిపోయింది. లెనిన్ టెలిఫోనులో, మాస్కో కమాండెంటుతో, కామ్రేడ్ జర్జెన్‌స్కీతో, అన్ని యుద్ధ కార్యాలయాలతోనూ మాట్లాడి, చివరకి ఆయువకుని విష యము తెలుసుకున్నాడు. పూరాగా అతని పత్తాతేసేవరకూ లెనిన్ ఊరుకోడుగాదూ ?

విమానాశ్రయంలోని ఆఫీసర్ల ప్రవర్తననుగూర్చి సమ గ్రంగా వెంటనే విచారణ జరిగింది. కొత్తగా బోల్షివిక్ ఆఫీసరు నొకణ్ణి నియమించేరు. కొందరిని అక్కడినుంచి మార్చేశారు. ఆ ప్రాంతంలోని యువకులు నిశ్చింతగా తమ కాలాన్నంతనీ వినియోగించి విమానాన్ని నడపడం నేర్చు కున్నారు. విమానాలు పాతతరహాలవైనా 'రెడ్స్'వాటితోనే శత్రువుల్ని తుక్కురేగగొట్టేరు.

"ఏ పనీ సగంచేసి వదలకు" అన్నాడు, లెనిన్.

........ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్,
ప్రారబ్ధార్థములుజ్జగింపరుగదా, ప్రజ్ఞానిధుల్ గావునన్.

# ప్రాణ ప్రమాదం

అది 1918 ఆకురాలుకాలం. ప్రజాపోరాటాలకి పరీక్ష సమయం. లెనిన్ రాత్రింబగళ్లు విశ్రాంతికూడా తీసుకోకుండా పనిచేస్తున్నాడు. ఆయన ఉత్సాహానికి పరిమితిలేదు. రోజూ ఎన్నో మీటింగుల్లో మాట్లాడేవాడు; కమిటీచర్చలలో పాల్గొనేవాడు; పుస్తకాలు రాసేవాడు; ఉత్తరప్రత్యుత్తరాలు, సలహాలు, సంభాషణలు వీటికి తెరిపేలేదు. ఆయన మీటింగులికి తరచుగా ఒంటరిగానే వెడుతూండేవాడు.

లెనిన్ అంటే కూలీ-రైతులకు ఎంతో ప్రేమ. కాని, ఆయనను ద్వేషించేవాళ్లు లేకపోలేదు. జార్‌చక్రవర్తి ఉద్యోగులు, జమీందార్లు, కోటీశ్వరులు— వీళ్లేగాక కొన్ని రాజకీయపార్టీలవాళ్ళకి కూడా బోల్షివిక్‌లంటే తగనికోపం. అందులోనూ మహామేధావి, పార్టీనిర్మాత అయిన లెనిన్ అంటే వాళ్ళకి మరీకోపం. అతన్ని ఎట్లాగైనా చంపేస్తే, బోల్షివిక్ పార్టీ నాశనం అయిపోతుందని వాళ్ళభ్రమ. వాళ్లు సమయంకోసంచూస్తూండేవాళ్లు. లెనిన్‌ని యెవరేనా జాగ్రత్తగా ఉండమంటే ఏమనేవాడో తెలుసా ?

"కార్మికపటాలం లేమటోడ్ ! అభేద్య కవచం, పెట్టని కోట ! కష్టజీవుల ప్రేమాదరాలు మనమీద వున్నంతవరకు మనం భయపడనక్కరలేదు."

ఒకరోజు మామూలుగానే ఒక ఫాక్టరీలో మీటింగుకి వెళ్లేడు, కారులో. కారు గేటుదగ్గర ఆగింది. లెనిన్ లోప లికి వెళ్లేక, బైట ఫాక్టరీ ఆవరణలోనివారంతాకూడా లోప లికి వెళ్ళిపోయేరు. ఛాఫరీ (మోటారు నడిపేవాడు) మాత్రం మోటారులో కూర్చున్నాడు. కొంచెంసేపట్లో యెవరో స్త్రీ, నల్లటి దుస్తులు ధరించి, కారు దగ్గిరికి హఠాత్తుగా వచ్చి, అడిగింది :

"కామ్రేడ్ ! లెనిన్ వచ్చేటట నిజమేనా ?"

"వచ్చిందెవరో నాకు తెలియదు" అన్నాడు ఛాఫర్.

"నువ్వొ ఓ ఛాఫరువే ? నీకారులో ఎవరువచ్చేరోకూడా తెలియదన్నమాట !" అని వెక్కిరింపుగా అంది, ఆ స్త్రీ.

"నాకదంతా యెందుకు ?" అన్నాడు, ఛాఫర్, ఆశ్చర్యంగా.

ఆమె వెళ్ళిపోయింది, ఫాక్టరీలోకి. ఒకగంట గడిచింది. మీటింగు అయిపోయి, లెనిన్ బైటికివచ్చేడు. బిలబిల్లా

డుదూ చుట్టూ జనం. ఓ పొడుగాటి నావికుడు గుమ్మంలో నిల్చుని చేతులుజాచి, "తోసుకురాకండి! తోసుకురాకండి!" అంటూ జనాన్ని ఆపుతున్నాడు. ఆతని కళ్ళల్లో ఏదో ఆందోళన కానిపిస్తూంది. కాని, కార్మికులంతా యితనూ లెనిన్‌తో వచ్చినవాడే ననుకున్నారు.

లెనిన్ కారుదగ్గిరికి వచ్చేడు. తలుపుమీద చేయి ఆను కున్నాడు. ఇంతలో రివాల్వరు పేలినచప్పుడు. మళ్ళీ ఇంకో సారి. లెనిన్ క్రిందపడిపోయేడు. నావికుని తోసుకుని జనం ముందుకి వచ్చేశారు. తన్ను ప్రశ్నించిన ఆ స్త్రీని కారువెనక చూడ్డంతోనే ఛాఫర్ ఉరికేడు. ఆమె తప్పించుకుని ప్రజల్లో కలిసిపోయింది. లెనిన్ క్రింద పడేవున్నాడు. ఛాఫర్ లెనిన్ దగ్గిరికి ఒక్క ఉరుకులోవచ్చి, మోకరించేడు. ఇంతలో యెవరో అన్నారు :

"లెనిన్‌ను హాస్పిటల్‌కి తీసుకుపోవాలి."

లెనిన్ మెల్లిగా కళ్ళు తెరచి, నీరసంగా అన్నాడు :

"అహుఁ! వద్దు. నన్ను యింటికి తీసుకుపోండి."

ఛాఫర్ నిల్చుని బిగ్గరగా జనంతో చెప్పేడు: "కామ్రేడ్ లెనిన్‌ను యింటికి తీసికుని వెడుతున్నాను." లెనిన్‌ను



లెనిన్ మెల్లిగాలేచి. కారులో కూర్చున్నాడు.
"నన్ను యింటికే తీసుకుపోండి. హాస్పిటల్‌కివద్దు."

64-(A)



ఈ సంగతి తెలిసిన అతని మిత్రులు చాల భయపడ్డారు.
....ఏమీ భయంలేదని లెనిన్ ....నచ్చచెప్పాల్సివచ్చింది.

64(B)

కారులో పండుకోబెట్టడానికి చాలమంది ముందుకు వచ్చేరు. కాని, లెనినే మెల్లిగా లేచి, కారులో కూర్చున్నాడు. ఆయన ముఖం వెల్లనైపోయింది. సీటులో కూర్చోలేక పక్కకి పడి పోయేడు. ఛాఫర్ తలుపులు మూసేసేడు. తక్షణం కారు బైలుదేరింది.

నల్లటిదుస్తులు ధరించిన ఆ స్త్రీని పట్టుకున్నారు. ఆమె దాగుకోడానికి ప్రయత్నించినా లాభం లేకయింది.

రష్యాఅంతటా యీవార్త చాల ఆందోళన కలిగించింది. రోజూ పత్రికల్లో లెనిన్ ఆరోగ్యవార్తకోసం లక్షలకొలది కాచుకుని ఉండేవారు. అందరిదృష్టి లెనిన్‌మీదే వుంది. డాక్టర్లు లెనిన్‌కి ప్రాణభయంలేదని ప్రకటించేరు. ఆరోజు రష్యాఅంతటా పండుగులావుంది. ఆపరేషన్‌చేసి, ఊపిరి తిత్తుల్లో యిరుక్కున్న గుళ్లు తీసేసేరు. లెనిన్ తిరిగి మామూలు ఆరోగ్యవంతుడుకానేలేదు. తర్వాత ఆయన జీవించిన అయిదున్నర సంవత్సరాలూకూడ ఏదోఒక రోగంతో బాధపడుతూనే వున్నాడు.

లెనిన్‌ని తాము సరిగా సంరక్షించలేకపోయేమని ఆ ఫాక్టరీ కార్మికులు ఎంతో నొచ్చుకున్నారు.

లెనిన్‌ను ప్రజలు ఆరోప్రాణంగా చూసుకునేవారు.

# సుబ్బోత్నిక్‌లు.

అంతర్యుద్ధ ఫలితంగా రష్యాఅంతటా ఎంతో ఆస్తి నష్టమైంది. ఫాక్టరీలు, గనులు, రైల్వేలు ధ్వంసమై పోయేయి. రైల్వేమీద ప్రయాణం చేసేవారికి ఆరోజుల్లో లైనుకిప్రక్కగా యెన్నో పాడైపోయిన యింజనులు, పెట్టెలు, వాగన్లు కనిపించేవి.

రైల్వేస్టేషన్లలోని సైడింగులమీద ఉండచుట్టుకుబోయిన యింజన్లూ, చక్రాలు గాలిలోకి పెట్టికొనివున్న పెట్టెలూ, వాటిమీద అటూయిటూ దుంగలూ, సిగ్నలు స్థంభాలూ, తీగలూ, అన్నీ పడివుండేవి. బ్రిడ్జీలెన్నో ప్రేల్చివేయబడి నాయి. పట్నాలు పట్నాలే నేలమట్టం అయిపోయినాయి.

మళ్ళీ అంతా మొదటినుంచీ నిర్మించుకోవాల్సి వచ్చింది. కూలీ-రైతుల రాజ్యం స్థిరపడినాక వాళ్లు చెమటోడ్చి రాత్రిం బగళ్లు పనిచేసేరు. రోజుకు 8 గంటలే పనివుండాలని పోరా డిన కార్మికులు 12 గంటలుకూడా పనిచేసేరు; పిల్లలచేత పనిచేయించరాదని పోరాడినవాళ్లు యిప్పుడు తమపిల్లలనే పనిలో పెట్టేరు; ఆదివారం సెలవుకావాలన్నవాళ్లు యిప్పుడు

ఆ సెలవుసుకూడా త్యాగంచేయ పూనుకున్నారు ! ఎందుచేతనో చెప్పుకోండి ? తమ కష్టఫలితాన్ని దోచుకుని కొద్దిమంది పెట్టుబడిదారులు లాభాలుర్రీసేరోజుల్లో యీహక్కులకోసం పోరాడడం కార్మికులకు ఉపయోగం. అల్లాగే ఆకోటీశ్వరుల రాజ్యం కూలిపోయి, కూలీరైతులరాజ్యం, తమ రాజ్యం వచ్చినపుడు, తాముచేసేకష్టానికి ఫలితం తమకూ, తమ బిడ్డలకూవస్తుంది. ఇదీ రహస్యం ! ఐతే ధనికప్రపంచ మంతా యీ సామాన్యజ్ఞానాన్నికూడా మరిచి, రష్యా కూలీ రైతులమీద తమకేదో మహాప్రేమవున్నట్లుగా, సోవియటు ప్రభుత్వం తన సిద్ధాంతాలు గాలికివదిలేసి, కూలీ-రైతుల చేత పశువుల్లా చాకిరీ చేయిస్తూందని ప్రచారం చేసింది.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, కష్టజీవులే తమంతట తాము ముందుకివచ్చి ఎక్కువపని చేయడానికి పూనుకున్నారని. ఏంజరిగిందనుకున్నారు ?

రష్యాలో కాజాన్ అనే పెద్దనగరంవుంది. అదొక రైల్వేజంక్షను. అక్కడి వర్కుషాపులచుట్టూ వందలకొద్దీ పెట్టెలు, వాగన్లు, యింజన్లూ తిరగబోర్లాపడి, అంతా నానా కంగాళీగానూ వుండేవి. యింజన్లకి అది ఓ పెద్ద 'వల్లకాడు!'

అన్నీ యింజన్ల అస్థిపంజరాలే! అదంతా బాగుచేసి, మంచి స్థితిలో పెట్టాలంటే ఎవడితరం? కాని, ఎవడికీ తరంగాని యీ పనిని చేయాలని అక్కడికార్మికులు వ్రతంపట్టేరు. కాలమానం, సెలవులూ అనే భేదాన్ని దూరంగానెట్టేరు! అనుకోడం యేమిటి, పనిలోకి దిగడం ఏమిటి?

ఓ శనివారంనాడు కొజాన్ కార్మికులు తమ సెలవును మానుకొని, స్టేషన్‌దగ్గిరికి వచ్చేరు. సోవియటు ప్రభుత్వం క్రింద వారం అంటే ఆరురోజులు. అంటే అయిదురోజులు పనిచేస్తే, ఆరోరోజు ఆటవిడుపు. అంటే యేడాదికి 52 కి బదులుగా 61 రోజులు సెలవుయిస్తారు. రష్యాభాషలో శని వారాన్ని 'సుబ్బోతా' అంటారు. ఆ సంబంధమైనదిగనక 'సుబ్బోత్నిక్'. ఇష్టమున్నవాళ్ళంతావచ్చి 'సుబ్బోత్నిక్'లో పాల్గొన్నారు.

సుత్తులూ, రెంచిలూ పుచ్చుకుని పనికివచ్చే యింజన్ భాగాలన్నీ విప్పి జాగ్రత్త పెట్టేరు; పనికిరానిదంతా తీసికెళ్ళి వాగన్లలో నింపేరు; బొగ్గు, కట్టెలూ యేరి పోగులుపెట్టేరు; చెత్తంతా దూరంగా గోతులుతవ్వి, పూడ్చేరు; ఆరోజంతా పనిచేసి, సంతృప్తిగా యిళ్ళకిబోయేరు. ఇందులో స్కూలు

పిల్లలుకూడా పాల్గొన్నారు. ఆడాళ్ళమాట చెప్పక్కరేలేదు. ఆరోజు పనికి కూలి పుచ్చుకోరు సుమా! ఇది దేశానికి, ప్రజాస్వామ్యానికి యీనాం!

పత్రికలన్నీ భేష్! అన్నాయి. కార్మికుని సమయస్ఫూర్తికి సెభాష్! అన్నారంతా. ప్రభుత్వం యేం చేసిందనుకున్నారు? 1920 మే 1 తేదీ సెలవుదినం దేశమంతా "సుబ్బోత్నిక్"గా ప్రకటించింది.

ఆ రోజున దేశం అంతటా కూలీలు, రైతులు, పిల్లలు అంతా, ఓపికున్నవాళ్ళంతా తమతమ చోట్లలో యిట్లాంటి కార్యక్రమం ప్రారంభించేరు. లెనిన్‌కూడా ఆరోజున క్రెమ్లిన్ యెదుట ఖాళీజాగాను శుభ్రం చేయడంలో పాల్గొన్నాడు.

ఉదయం పదిగంటలకి బ్యాండు మ్రోగుతూంది. కేంద్ర ప్రభుత్వోద్యోగులు, క్రెమ్లిన్ మిలిటరీ కాలేజీ విద్యార్థులు, ప్రొఫెసర్లు అంతా బారులుతీరి వచ్చేరు. ఎర్రజెండా ముందర యెగురుతూంది. క్రెమ్లిన్ యెదుట ఖాళీస్థలంలో జెండానాటి, పని ప్రారంభించేరు. దుంగలు, దూలాలు, రాళ్లు, చెక్కలు, చెత్త, తీగలు, విరిగిన బళ్లు, పీపాలు అన్నీ యెత్తి శుభ్ర

పరచడం; గోతులు పూడ్చి, చదును చేయడం, యుద్ధంలో ఫిరంగిగుళ్ళకి కూలిన గోడలు మరామ్మతు చేయడం; సాయంత్రానికి 'క్రెమ్లిన్ స్క్వేర్' శుభ్రంగా, అందంగా చేయాలి.

లెనిన్ మరో విద్యార్థి యువకునితో కలిసి దూలాలు మోస్తున్నాడు. తాను బరువువైపు యెత్తుకోవాలనీ, లెనిన్‌కి తేలిక చేయాలనీ ఆవిద్యార్థి తాపత్రయం. లెనిన్ యిది కని పెట్టేడు. తానే బరువైన కొస ముందుగా యెత్తుకోనారంభించేడు.

''కామ్రేడ్! నాకు యిరవై యెనిమిదే. మీకు యేభై యేళ్ళు!'' అన్నాడు యువకుడు.

''ఇంకా యెక్కువ యేళ్ళుండేమాత్రం ఏం? ఫర్వాలేదులే, కానీ, కామ్రేడ్!'' అన్నాడు నవ్వుతూ లెనిన్.

మధ్యాహ్నానికి చాలా పని అయిపోయింది. అందరి ముఖాలూ చెమటలు కారుతున్నాయి. లెనిన్ గ్రూపులోని కార్మికుడు లెనిన్‌ని చూసి అన్నాడు:

''కామ్రేడ్! మీకు అవతల చాల ముఖ్యమైన పనులుంటాయి. వెళ్ళండి. మేం యిది పూర్తి చేసేస్తాములే.''

"ప్రస్తుతానికి యిదే అన్నిటికంటే యెక్కువ ముఖ్యమైన పని, కామ్రేడ్ !" అని సమాధాన మిచ్చేడు, లెనిన్.

ఆరోజున చమత్కారంగా మాట్లాడుకుంటూ, బాతాఖానీ వేస్తూ, ఆడుతూ పాడుతూ పనంతా పూర్తి చేసేరు. ఒకరికంటె మరొకరు యెక్కువపని చేయాలని పందేలు వేసుకున్నారు, చూడాను.

లెనిన్ గబగబా నడుస్తాడు. తనగదిలో ఏవిషయాన్నైనా ఆలోచిస్తూ, పచారు చేస్తూన్నప్పుడు, పరుగెత్తుతూన్నాడా అనిపిస్తుంది, చూసేవాళ్ళకి. ఆరోజున ఆతనితో సమానంగా అంతా గబగబా పనిచేయడానికి ప్రయత్నించేరు.

ప్రొద్దు వాలింది. అంతా అలిసిపోయారు. కాస్సేపు కూర్చుని, చుట్ట కాల్చుకుందామని ఎవరో అన్నారు. అందరూ దానికే ఎదురు చూస్తూన్నారేమో, గుంపులుగా అక్కడక్కడ దూలాలమీద చతికిలపడ్డారు. చుట్టలూ, సిగరెట్లూ, పైపులూ,—ఎవరికి అలవాటైంది వాళ్ళు పైకితీసారు. ఎవరో లెనిన్‌కి సిగరెట్టు యివ్వబోతే వద్దన్నాడు.

"కామ్రేడ్ ! అలవాటులేదు, నాకు."

"ఎప్పుడూ పొగపీల్చలేదూ, మీరు ?"

"హైస్కూల్లో చదువుకొనేటప్పుడు అలవాటయింది. కాని త్వరలోనే యీదురలవాటు మానుకున్నాను." అన్నాడు.

లెనిన్ పొగకాని, మత్తుకలిగించే పానీయాలు కాని త్రాగేవాడు కాదు. వాటివల్ల హుషార్ కలుగుతుందని యెవ రేనా అంటే, నవ్వుతూ అనేవాడు:

"అది పొరపాటు, కామ్రేడ్! పైగా అనారోగ్యం కూడాను."

పరిశుద్ధమైన చల్లని నీళ్లు త్రాగటంవల్ల ఎంతో ఉల్లాసం కలుగుతుంది. తనకెట్టి దురభ్యాసాలూ లేకున్నా, అట్టి అల వాట్లు గలవాళ్లని, లెనిన్ ఎప్పుడూ మోటుగా నిరసించే వాడు కాదు. మనం వున్న సమాజంవల్ల సంక్రమించిన యీదురలవాట్లన్నీ క్రమంగా మానవజాతి విజ్ఞానాన్ని పొందు తూన్నకొద్దీ దూరంగా తొలగుతాయని ఆయన అనేవాడు.

ఆరోజున లెనిన్ పాల్గొన్న 'సుబ్బోత్నిక్', సోవియటు కూలీరైతుల్ని ఉత్సాహపరచింది.

ఆమరుసటి శనివారం దేశంలో కోట్లమంది ఉత్సా హంగా వివిధపనుల్లో పాల్గొని, మాతృభూమిని సంపదలతో తులతూగేటట్లు చేసే కృషిలో ఒకడుగు ముందుకేసేరు.

# చిన్నపిల్లవాడూ, లెనినూ

ఆపిల్లవాడు 'యామ్' గ్రామాన్నుంచి నడిచి వస్తూన్నాడు. అతని చేతులో ఖాళీసజ్జ తీసుకెడుతూన్నాడు. ఆదారులన్నీ పిల్లవానికి కొట్టినపిండే. సహకారక్షేత్రానికి వెళ్ళి కూరగాయలు తేడానికని వాళ్లమ్మ పంపింది, బాలుని.

మొదట ఒకచేను దాటాలి. అక్కడినుంచి చిన్న యేరు వెంబడే కొంతదూరం వెడితే, ఓవంతెన వస్తుంది. వంతెన దాటితే కాలిబాట కనిపిస్తుంది; బాటవెంబడే నడిస్తే చిన్న కొండమీదికి తీసుకుపోతుంది. అక్కడ పెద్దపెద్ద చెట్లమధ్య స్తంభాల వరసలతో ఓ తెల్లటి భవనంకూడా వుంది. కొండ దిగగానే వుంది, బాలుడు వెళ్లవలసిన తోట.

ఇల్లు యింకా అల్లంత దూరంలో వుండనగానే పిల్లవానికి ఒక మనిషి కనిపించేడు. అతను నీలిరంగు చొక్కా తొడుక్కుని, స్లిప్పర్లు వేసుకుని నడిచి వస్తూన్నాడు.

పిల్లలలో కల్లకపటములుండవు. అమాయకులు. ఆపిల్లవాడు, తనకు తెలిసిన గొప్పసంగతి నాతనికి చెప్పాలనుకున్నాడు.

"ఆయింట్లో యెవరుంటూన్నారో తెలుసా ?...."

"ఎవరుంటున్నారేమిటి ?" అన్నాడాతడు.

"లెనిన్, లెనిన్, ఏమనుకుంటున్నావో, మరి!...."

ఆతడు టోపీని నుదుటిమీదినుంచి కొంచెం వెనక్కి తోసుకుని, తీక్ష్ణంగావున్న యెదురెండలో కళ్లు చికిలించి పిల్లవానివైపు చూసేడు.

"ఇతడెవరో పట్నవాసం వాడై వుంటాడు." అనుకున్నాడు; పిల్లవాడన్నాడు :

"అబ్బో, యిక్కడికి పట్నాన్నుంచి పెద్దపెద్దవాళ్లంతా వస్తుంటారు. అందరికీ తెలుసు, యిది."

"ఈ ప్రదేశం చాలా బాగుంది." అన్నాడాతడూ.

ఇద్దరూ కలిసి ప్రక్క ప్రక్కనే నడుస్తూన్నారు.

"లెనిన్ని చూడాలని నాకెంతో యిది !"

"ఏం ? ఎందుకూ ?"

"ఏమూ? అదేం ప్రశ్న! ఎందుకేమిటి ? ఎల్లావుంటాడో చూద్దామని." అన్నాడు, బాలుడు.

"ఆఁ! అతడు, మనందరికిలాగానే వుంటాడు, మామూలుగానే. అందరూ అనటం, లెనిన్ నాకుమల్లే వుంటా



ఇద్దరూ కలిసి ప్రక్క—ప్రక్కన్ నడుస్తున్నారు.
"లెనిన్‌ని చూడాలని నాకెంతోయిది."



"పునై సెత్! పునై సెత్ మర్జత్!"
"రేగుపళ్లు! ఎర్రటి రేగుపళ్లు"

74 (B)

డని! మాయిద్దర్నీ ఓచోట నిలుచో బెడితే నువ్వు పోల్చు కోనేలేవు!''

"ఓస్! బడాయి!....నేనే పోల్చుకోలేనూ? మీయిద్దర్నీ!''
అన్నాడు, పిల్లవాడు, కళ్లు పెద్దవిచేసి.

అతనికి నవ్వు వచ్చింది. బిగ్గరగా నవ్వుతూ, పిల్లవాని వైపు వంగి,—

'అయితే, నేను లెనిన్‌లాగ వుండనంటావు?' అన్నాడు.

పిల్లవాడు అతన్ని యెగాదిగా చూస్తూ, అన్నాడు:

"లెనిన్ అయితే, నీకు మల్లే నీలిచొక్కా, స్లిప్పర్లూ వేసుకుని, యిల్లా తిరుగుతాడనుకున్నావా? అబ్బో! ఆయన మాంఛి నల్లటిఉన్నికోటూ, మెరిసిపోయే పెద్దబూట్లూ...."

ఇల్లా మాట్లాడుకుంటూ పెద్దచెట్లదగ్గరకి వచ్చేరు. అతడాగి, పిల్లవాని నడిగేడు:

"నీపేరేమిటి, అబ్బాయీ? ఇట్లా యెక్కడికి వెడుతున్నావు?"

"నాపేరు మీషా. కేబేజీకోసం ఉమ్మడిపొలానికి వెడుతున్నా."

"అయితే తిన్నగా వెళ్ళు. నేను యిక్కడ మలుపు తిరిగి, యిట్లా వెళ్లాలి. గుడ్ బై, మీషా!"

బాలుడు తిన్నగా పొలంవైపు వెళ్ళిపోయేడు. కేజీబీ మళ్ల దగ్గరే రోడ్డుమీద గొద్దాలికం పట్టుకుని ఒకస్త్రీ నిలుచుని వుంది. పిల్లవాడు సమీపించగానే ఆమె అడిగింది :

"లెనిన్‌తో, యేమిటబ్బాయీ! మాట్లాడుతున్నావ్?"

బాలుని చేతులోంచి సజ్జ జారిపోయింది. అప్రయత్నం గానే ఆతడు వెనకతిరిగి చూసేడు.

కాని, లెనిన్ అప్పటికి వెళ్లేపోయేడు.

# పెద్దచెట్టు

"గోర్కీ"కి దగ్గఱలోనే ఒకచిన్న కొండమీద పెద్ద పెద్ద చెట్లు చక్కగా పెరుగుతూన్నాయి. 'గోర్కీ' అంటే తెలుసా? ప్రపంచంలోని గొప్ప రచయితల్లో ఒకడు. అతడు రష్యా దేశీయుడు. అతని జ్ఞాపకార్థంగా ఆపట్టణా నికి 'గోర్కీ' అనే పేరు పెట్టేరు, సోవియటు ప్రభుత్వం వారు. కొండమీదినుంచి చూస్తే, పొలాలూ, గ్రామాలూ,—



లెనిన్.... ఆ చెట్టుక్రింద నిలబడి.... చుట్టూవున్న ప్రశాంత ప్రకృతిని చూసి.
మైమరచేవాడు.

76(A)



లెనిన్ బరువైనకొస ముందుగా యెత్తుకోనారంభించేడు

"కామ్రేడ్! మీకు యేభై యేళ్లు!" అన్నాడు, విద్యార్థియువకుడు.

76 (B)

అన్నీ చక్కగా కనిపిస్తాయి. ఒకవైపు చిన్ననదీ, మరొక వైపు గ్రామం అవలగా రైల్వేలైనూ కనిపిస్తూనే వుంటాయి.

లెనిన్ అప్పుడప్పుడు వచ్చి, అక్కడుంటుండేవాడు. కొండమీదనుంచి నదివైపుదిగి, పొలాల్లో రైతులతో మాట్లాడుతూనో, పైన నిల్చుని దూరంగా పరుగెత్తిపోతూన్న రైలుబండివైపు చూస్తూనో, చెట్లనీడని ఏదో చదువు కుంటూనో కాలం గడిపేవాడు.

ఆ కొండమీదే చక్కని "పార్కు" యేర్పాటుచేసింది, ప్రభుత్వం. సెలవుదినాల్లో చుట్టుప్రక్కలవాళ్ళంతా అక్కడే వుండేవారు. వేసవిలో అక్కడి చెట్లనీడల్లో పిల్లలు కోలాహలంగా ఆడుకుంటూండేవారు. అక్కడి చెట్లని ఎవరూ కొట్టకూడదు.

ఆ పార్కులో అన్నిటికంటె పెద్దదైన చెట్టు ఒకటుండేది. అది దారికి సమీపంలోనే వుండడంవల్ల, దారిపోయే వాళ్లు ఒక్కసారైనా దాని నీడక్రింద చల్లగా కూర్చోకుండా వెళ్లరు. దట్టమైన ఆకులతో దానికొమ్మలు చుట్టూవ్యాపించి, గొడుగులా ఎండపొడేనా పడకుండాచేసే దా పెద్దచెట్టు.

లెనిన్‌కూడా అక్కడికివచ్చి, ఆ చెట్టుక్రింద నిలబడి, విశ్రాంతిగా చుట్టూవున్న ప్రశాంత ప్రకృతినిచూసి, మైమరచి పోయేవాడు.

ఒకరోజున లెనిన్ మామూలుగా అక్కడికి వెళ్లేసరికి చెట్టులేదు. మొదలుమాత్రం నిలిచివుంది. మాను దూరంగా గడ్డిలో పడివుంది. కొమ్మలు, రెమ్మలు అన్నీ చెలిపేసి, చిందరవందరగా పడేసేరు. ఆయనకు యీ విధ్వంసాన్ని చూస్తే, చాల విచారం, కోపంకూడా కలిగింది. ఇంటికి వచ్చేసి, ఆ చెట్టు యెవరుకొట్టేరని అందర్నీ అడిగేడు.

గోర్కీలోవుండే కమాండెంటే ఆ చుట్టుప్రక్కలకంతకీ అధికారి. పార్కూ, పవరుస్టేషనూ, అన్నీ ఆయన అధికారంక్రిందనే వుంటాయి. ఆయన్నే అడిగేరు, ఆ చెట్టు యెవరు కొట్టిందీ తెలియదా ? అని. చివరకి తేలిందేమిటో చెప్పనా ?

ఆ పెద్ద చెట్టును, కమాండెంటే కొట్టించేసేడు !

ఈమాట వినేసరికి, లెనిన్‌కి చాలాకోపం వచ్చింది :

“దారుణం ! అతన్ని అరెస్టుచేయండి.”

కమాండెంటు, పాపం, యిట్లా జరుగుతుందనుకోలేదు. లెనిన్ దగ్గరకివెళ్ళి, కంచెలకి రాటలు కావాలసి చెట్టును కొట్టించేనని చెప్పి, యేవేవోకారణాలు చెప్పేడు.

కాని, లెనిన్ కఠినంగా జవాబిచ్చేడు :

"పార్కులో చెట్లు రాటలకోసంకాదు, పెంచుతూన్నది-చిన్నపిల్లలకిసూడా యీ సంగతి తెలుస్తుందే. పైగా నువ్వు పెద్దవాడివీ, అధికారివీను !"

తప్పు జరిగిపోయిందనీ, మొదటితప్పుగా మన్నించి, తక్కువశిక్షతో పోనిమ్మనీ బ్రతిమాలుకున్నాడు, కమాండెంటు.

"తక్కువశిక్ష ? అదేం నా చెట్టుకాదు ! ప్రజలసొత్తు అది. దాన్ని పాడుచేసినందుకు తేలిక శిక్షతో పోడానికి వీల్లేదు.

అని కఠినంగా చెప్పేశాడు, లెనిన్.

లెనిన్ కుటుంబంలోనివాళ్లుకూడా కమాండెంటు తెలియక చేశాడుగనుక యేదో తేలికగా పోనిమ్మని చెప్పేరు. కాని లాభంలేకపోయింది.

"అధికారి చేసేడుగనకనే మరీపెద్దనేరం అవుతుంది. ఈ ఆస్తినంతనీ కాపాడవలసిన బాధ్యత, అధికారంయిస్తే,

తానే ప్రజాద్రవ్యాన్ని నాశనం చేస్తున్నాడే! క్షమించరాని నేరం, యిది."

కమాండెంటు, మూడురోజులు ఖైదులో గడపాల్సి వచ్చింది.

అన్నిదేశాలచట్టాలూ "ఆస్తి, సంపదలు పవిత్రమైన వనీ, స్పృశించడానికన్నా వీల్లేని"వనీ అంగీకరిస్తాయి. కాని, యీ ఆస్తిసందలు 'ప్రజలసొత్తు'గాకుండా వ్యక్తుల చేతుల్లో వుండేటందుకే యీచట్టాలు. ఒక్కసోవియట్‌లోనే అట్లుగాదు.

## విద్యుద్దీపాలు

మనదేశం వలెనే ఆరోజుల్లో రష్యాకూడ వ్యవసాయ దేశం. పెద్ద పెద్ద పరిశ్రమలు లేవు; రైళ్ళు, రోడ్లు లేవు; నూతన విజ్ఞానపు వెలుగులు అక్కడ ప్రసరించలేదు. ఉన్న కొద్దిపరిశ్రమలూ, రైల్వేలు, అంతర్యుద్ధంలో నాశనం అయేయి. విజ్ఞానవేత్తలు విదేశాలకి వెళ్ళిపోయేరు.

ప్రజలకి తిన తిండి, కట్ట గుడ్డ, ఉండ నిల్లు యివి కలగ చేయడం ప్రథమకర్తవ్యం. రెండోది విజ్ఞానవంతుల్నిగా, నేర్పరులైన పనివాళ్లుగా వారిని తయారుచేయడం. దీనికి మార్గం ఒకేఒకటి. ఇంతవరకూ మానవవిజ్ఞానం సాధించిన మహత్తర సాంకేతిక విజయాల్ని వస్తూత్పత్తికై వినియోగించాలి. అంటే యంత్రశక్తి, ఆవిరిశక్తి, విద్యుచ్ఛక్తి-మొదలైనవాటి సాయంతో వస్తువుల్ని విరివిగా తయారు చేయాలి. మానవుని నెత్తినవున్నభారంలో హెచ్చుభాగాన్ని యంత్రాలమీదపెట్టి, తాను తన 'అవసరాల్ని' గుర్తించి, సంపాదించుకోడమేగాక అంతకంత కెక్కువగా 'స్వేచ్ఛ'ను పొందగలుగుతాడు. ఈ స్వేచ్ఛను, తన తీరికకాలాన్ని విద్యోపార్జనకై వెచ్చించి, యింకా నూతన అభివృద్ధికి రాజమార్గం వేస్తాడు, మానవుడు.

అందుకే యుగపురుషుడనదగిన లెనిన్ అన్నాడు: "శాస్త్రవిజ్ఞానాన్ని ప్రజాతంత్రంతో జోడించండి. మీ అభివృద్ధి నరికట్టగలదేదీ వుండదింక."

దేశంఅంతా విద్యుచ్ఛక్తిమయం చేయాలని సోవియటు ప్రభుత్వం సంకల్పించింది. నదీనదాలు, సెలయేళ్లు,—అన్ని

టినీ బంధించి, చెప్పుచేతల్లో పెట్టుకున్నారు. ఆ ప్రవాహ జలాలతో యంత్రాల్నినడిపి, విద్యుచ్ఛక్తి తయారుచేయ నారంభించేరు. ఇదంతా అప్పటివరకూ 'మట్టిపిసుక్కునే' రైతులు సాధించినదే.

కాషినో అనే గ్రామంలో రైతులుకూడా తమ గ్రామం లోకి విద్యుచ్ఛక్తి తేవాలని నిశ్చయించేరు. ఎంతోశ్రమపడి, అందుకుతగిన యంత్రాదుల్ని సేకరించేరు. ఓ పెద్ద పశుల కొట్టాములో యంత్రాల్నిబిగించి, 'డైనమో' తయారు చేసేరు. వీధులన్నిటా యెత్తైన స్తంభాలుపాతి, తీగలుతీసి, యింటింటా బల్బులు బిగించి, విద్యుద్దీపాలు యేర్పాటు చేసేరు. తోటల్లో పైరులకి నీరుపారించడానికి నూతుల్లో నీటిపంపులు, ఎలక్ట్రిక్ మోటార్లు పెట్టేరు. ఒక్కమీట నొక్కితే గ్రామంఅంతా దీపావళి వెలుగే: తోటలన్నిటికీ తీయనీటి జల్లులే. పశువులచేత చచ్చేలా పనిచేయించనక్క ర్లేదు, గ్రామం పాడిపంటలతో కలకల్లాడుతుంది. అదివర కటి కష్టాల్ని ఒక్కక్షణం మరిచిపోయేరు, వృద్ధులు. పిల్లలు ఉత్సాహంగా ఆడుతూపాడుతున్నారు.

ప్రారంభోత్సవానికి లెనిన్‌నే ఆహ్వానించేరు. ఆయన అంగీకరించేడు. కాని, క్షణం తీరికలేని ఆతడు వస్తాడనే

ధైర్యం వాళ్ళకి లేకపోయింది. ఊరంతా పచ్చని తోరణాల తోనూ, ఎర్రటి జెండాలతోనూ అలంకరించేరు. పిల్లలు గ్రామంబైటే రోడ్డుకడ్డంగా ఆడుతూ, లెనిన్ 'తాత'కోసం కాచేరు.

"లెనిన్ రాడేమో!" అన్నారెవరో.

వస్తానంటే రావడమే. నీకు సందేహమెట్లా కలిగిం దిరా?" అన్నారు యింకొకరు.

మాటలోనే మోటారువచ్చి నిలిచింది. కిలకిల్లాడుతూ పిల్లలూ, వాళ్ళవెనక లెనిన్, నాడ్జ్యాదా దిగేరు. అందర్నీ పేరుపేరా లెనిన్ పలకరించి, కుశలప్రశ్న లడుగుతూంటే వాళ్ళముఖాలు వికసించినాయి. లెనిన్‌కి అఖండమైన జ్ఞాపక శక్తి. ఒక్కమాటుచూస్తే, ఎప్పుడూ మరిచిపోడు.

కుశలప్రశ్నలు పూర్తై, విందుకి కూచున్నారు. ప్రతి ప్రశ్నకీ, జవాబుచెపుతూ, దేశపరిస్థితినంతనీ వివరించేడు, లెనిన్. ముందు ఆశాపూరితమైన జీవితంకోసం యెన్ని త్యాగాలుచేయాలో చెప్పేడు. అతనిమాటలు చిన్నపిల్లలకి కూడా తెలిసేటంత సులభంగా వుంటాయి. అతనిచుట్టూచేరి పిల్లలు అల్లరిమాని, లెనిన్ నోటంటవచ్చే ప్రతీమాటా వింటున్నారు.

ప్రొద్దువాలింది. ఫొటోగ్రాఫర్ తొందరపడుతున్నాడు. ఫొటోకోసం అందరికంటె ముందుగా పిల్లలు గుమిగూడు తూంటే పెద్దలు వాళ్ళని కసిరికొట్టడంచూసేడు, లెనిన్. ఆయనకి పిల్లలంటే మహాయిష్టం. ఆయనకి బిడ్డలు లేక పోయినా, అందర్నీ తనబిడ్డలకంటె యెక్కువగా చూసే వాడు. ముందుగా పిల్లలమధ్యకివెళ్ళి కూర్చుని, వాళ్ళతో ఫొటో తీయించుకున్నాడు. తరవాత పెద్దలందరితోనూ మరోఫొటో తీసేరు.

సాయంత్రం చీకటిపడుతూంది. నాలుగువీధులమొగలో ఓ స్తంభానికి పెద్ద 'బల్బు' వేళ్లాడుతూంది, క్రిందుగా ఒక కుర్చీ వేసివుంది. పాటలతో ఊరేగింపుగావచ్చి, జనంనిలబడి వున్నారు. లెనిన్ కుర్చీయెక్కి, 'స్విచ్' నొక్కేడు. దీపం వెలిగింది, చీకటిని పటాపంచలుచేస్తూ.

రష్యాదేశాన్ని అంధకారాన్నుంచి ఉద్ధరించి, దీపం వెలి గించినవాడు, లెనిన్. అందుకనే ఆదేశప్రజలు,—

"ఈ దీపం మహాత్ముడు లెనిన్ వెలిగించిందే!" అని అంటూంటారు.

# ఇంజన్ "U-127"

రైలుయింజన్లన్నిటికీ నెంబర్లూ, పేర్లూ వుంటాయి. మాస్కోలోని పావేలెట్‌స్కీ స్టేషన్‌లో "U-127" యింజన్ ఉంది. దానిదో పెద్ద కథ !

మాస్కోలోని రైల్వేకార్మికులు 'సుబ్బోత్నిక్' క్రింద తయారుచేసినదా యింజన్. ఆరితేరిన పనివాళ్లు నిర్మించేరు, దాన్ని. సోవియటు ప్రభుత్వానికి దీన్ని బహూకరించాలని రైల్వే కార్మికసంఘం నిశ్చయించింది. మే 1 వ తేదీనాటికి (1921) దాన్ని పూర్తిచేసి నడిపించాలనే ఊహతో ఒక్క నిముషంకూడా వృధాచేయకుండా దాన్ని నిర్మించేరు. దీనికి డ్రైవరుగా లెనిన్‌ను ఆహ్వానించాలని వాళ్ళకి సరదాపుట్టింది. ఒక కమిటీని యెన్నుకుని లెనిన్ దగ్గిరికి రాయబారం పంపేరు; లెనిన్ అంగీకరించేడు.

"ఇదివరలో నేను ఫైర్‌మన్‌గా పనిచేసేను. ఇప్పుడు డ్రైవర్‌గా ప్రమోషన్ దొరికిందన్నమాట !"

అందరూ యీ చమత్కారానికి నవ్వేరు. అక్టోబరు విప్లవానికి కొద్దివారాలు ముందే లెనిన్ రైల్వే యింజన్‌లో తప్పించుకు పోయిన కథ అందరికీ తెలుసు.

"రైల్వేకార్మికులందరికీ నా వందనాలు అందచేయండి.

మీ 'సుబ్బోత్నిక్'లను మేము చాల సంతోషంగా స్వీకరిస్తాము."


లెనిన్ మహాశయుడు.

మొదటిసారి లెనిన్ "గౌరవ" డ్రైవరుగా వున్న యీ యింజన్ "U-127" ఎంతో పనిని చేసింది. 1924 జనవరి 21వ తేదీని ఈయింజన్ ఆఖరి ప్రయాణాన్ని చేసింది. ఆదినం, ప్రపంచ కష్టజీవులకి మరువరానిది. లెనిన్ మరణించినదారోజునే. సోవియట్ ప్రజలంతా దుఃఖములో మునిగిపోయేరు.

గోర్కీ పట్టణంలో 1924 జనవరి 21 వ తేదీని లెనిన్ మరణించేడు. ఆయన భౌతిక శరీరాన్ని యీ యింజన్ మాస్కోకి తీసుకువచ్చింది.



లెనిన్ మ్యూజియంలో రెండో అంతస్థుకిపోవు
చలవరాతి మెట్లు.

86 (A)



1918 - 22 లలో లెనిన్ ఆఫీసుగది మాదిరినే లెనిన్ మ్యూజియంలో భద్రపరచి యున్నారు.

86 (B)

లెనిన్ శరీరాన్ని రసాయనాల్లోముంచి, ఒక పెద్ద గాజు పెట్టెలోవుంచి, మాస్కోలోని రెడ్‌స్క్వేర్‌లోని చిన్నసమాధి గృహంలో వుంచేరు. ఆయన దేహాన్ని యిప్పటికీ చెక్కు-చెదరకుండా అక్కడ భద్రంగా మనం చూడవచ్చు.

ప్రపంచం అంతనుంచీ నిత్యమూ వేలకొలది ప్రజలు లెనిన్ దేహాన్ని చూడ్డానికి వెడుతూంటారు. నిద్రిస్తున్నాడా అన్నట్లుగా వుంటుంది యిప్పటికీ, లెనిన్ శరీరం.

లెనిన్ డ్రైవరుగావున్న ఆ యింజన్ "U-127" కూడ ఆతర్వాత యేమీ పనిచేయలేదు. దానిని ఆయన స్మారక చిహ్నంగా యిప్పటికీ పదిలపరుస్తున్నారు, కార్మికులు. అది అన్నియింజన్‌లలాగా వుండదు. ఎర్రటి రంగుమీద పొగ గొట్టం ఒకటిమాత్రం నల్లగావుంటుంది. చక్రాలమీద తెల్లటి చారలుంటాయి. బంగారురంగుతో "U-127" అని మెరుస్తూంటుంది. ఇంజన్ పైభాగంఅంతా గాజుపొరతో కప్పేశారు. రోజూ దానిమీది దుమ్ముతుడిచి భద్రంగా కాపాడుతూంటారు. ఈస్మారకచిహ్నాలన్నిటికంటె మించినది. ప్రజా హృదయాల్లో వుందనేది యెవరెరుగరు? అయినా ప్రపంచానికి అంతాపోయినదారినే పోవడం యిష్టంగాదూ?

# లెనిన్ మ్యూజియం

ఎంతవారుగానీ యెల్లకాలం బ్రతుకలేరుగదా! మహాత్ముల స్మృతిచిహ్నాంగా వారిబోధనలు, గ్రంథాలు వేల సంవత్సరాలు గడిచినా మనకు మిగిలివున్నాయి. అల్లాగే వారి స్మారకచిహ్నాలు కూడ నిర్మించుతూంటారు. బుద్ధుడు అశోకుడు, గాంధిజీ మున్నగు మహాత్ముల స్మృతిచిహ్నాలుగా మనదేశంలో యెన్నోకట్టడాలు, ఆరామాలువున్నాయి తెలుసా? అల్లే విజ్ఞానాభివృద్ధివల్ల మహాత్ముడైన లెనిన్ భౌతికదేహాన్నికూడా భద్రపరచే అవకాశం కలిగింది.

అదిగో! అదే మాస్కోలోని విప్లవ చతుష్పథంలోని సెంట్రల్ లెనిన్ మ్యూజియం. జేగురు రాతితో నిర్మించిన దాని మూడు అంతస్థులలోనూ యిరవై ఒక్క హాల్సు వున్నాయి. అవన్నీ నిరాడంబరంగా, గంభీరంగా అమర్చబడిన బీరువాలతో ఏడువేలకు పైబడిన ఎగ్జిబిట్‌లచే అలంకరించబడి వుంటాయి.

లెనిన్ రచనల ఫొటోస్టాటిక్ కాపీలు, ఆయన గ్రంధాల అనువాదాలు, లెనిన్ వుపయోగించిన గ్రంథ సముదాయం, అపురూపమైన ఫొటోగ్రాఫులు, ఆయన వాడిన వస్తువులు, చిరస్మరణీయుడైన ఆ మహాత్ముని చిత్రాలు, శిల్పాలు,-



సెంట్రల్ లెనిన్ మ్యూజియంలోని ఒక హాలులో.

88 (A)

88 (B)



రివల్యూషన్ స్క్వేర్ మాస్కోలో సెంట్రల్ లెనిన్ మ్యూజియం.

యివన్నీ చక్కని గ్లాసు కేసుల్లో అమర్చబడి వున్నాయి, అక్కడి హాలుల్లో.

లెనిన్ జీవితమంతా ప్రజాసేవలోనూ, విజ్ఞాన సంపాదన లోనూ గడిపేడు. ఆయన యెన్నో గ్రంధాలు రచించేడు. ప్రధానమైన ఆయన గ్రంధాల వ్రాత ప్రతులన్నీ ఫొటో కాపీలు తీసి, గాజుకేసుల్లో ప్రదర్శించేరక్కడ.

ఒక పెద్ద హాలులో మధ్యగా పెద్ద గ్లోబ్ అమర్చబడి, తిరుగుతూంది. దానిమీద అన్ని ఖండాలూ, దేశాలూ, ప్రధాన పట్టణాలూ గుర్తించబడి వుంటాయి. లెనిన్ మహాశయుని గ్రంధాలు యెక్కడెక్కడ ముద్రించబడినాయో ఆ ప్రదేశాలన్నీ గ్లోబ్ మీద ప్రకాశమానంగా నక్షత్రాల్లాగ వెలుగుతూ కనిపిస్తుంటాయి. ఆ హాలులో గోడలదరినే పెద్ద బీరువాల్లో నిండుగా పుస్తకాల వరుసలున్నాయి. ఆ పుస్తకాలన్నీ లెనిన్ రచనలే. ప్రపంచంలోని 117 భాషల్లోకి ఆయన గ్రంధాలు అనువదించబడి, ప్రచురించబడినాయి.

మన తెలుగులో కూడ లెనిన్ గ్రంధాలు కొన్ని అనువదించబడి, ప్రకటించబడినాయి. అవికూడా అక్కడి బీరువాల్లో వున్నాయి, తెలుసా? మీరు పెద్దవాళ్లై లెనిన్

గ్రంథాలు చదివి, ఆయన సిద్ధాంతాలు మానవజాతికి యెంత శ్రేయోదాయకములో తెలుసుకుంటారు.

చివరి 'హాల్లో' లెనిన్ ఫిల్ముకూడ ప్రదర్శింపబడుతూం టుంది. ఆయన ప్రజలతో మాట్లాడడం, వుపన్యసించడం మనం చూస్తాం, వింటాం. ఈ విధంగా ఆ మహాత్ముని జీవిత విశేషాల్ని చూచేందుకూ, వినేందుకు, తెలుసుకునేం దుకు అందరికీ అవకాశాలు కలిగించబడినాయి.

దినానికి రెండువేలకు పైబడిన జనులు లెనిన్ మ్యూజి యానికి దర్శనోత్సాహులై వస్తూంటారు.

చిరస్మరణీయులైన మహాత్ములెందరో వున్నా మనం వారినందర్నీ చూడలేము. శాస్త్ర పరిజ్ఞానం అభివృద్ధిబొంది నందువల్లనే మనమీనాడు కొందరినైనా చూడ్డం, వినడం సాధ్యమవుతూంది. ఫోటోగ్రాఫులు, ఫిల్ములు, అచ్చుపుస్త కాలు, చిత్రాలు, శిల్పాలు, ఆఖరికి మహాత్ముల భౌతిక దేహాలనే మనం చూస్తున్నామంటే శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధే కారణంగదూ. అట్టి విజ్ఞానాన్ని మీరందరూ సాధించేందుకు యెప్పుడూ కృషి చేస్తూండాలి. అప్పుడే మనం మానవుల మనిపించుకుంటాం.

# LENIN JEEVITHA KATHALU.

By: **M. JAGAN MOHAN RAO**

*With Illustrations* *Price Rs. 1/-*

Pub: *VISWASAHITYA MALA, Rajahmundry.*

★


మా ప్రచురణలు:

| | | |
|---|---|---|
| విప్లవ సందేశం (నాలుగో కూర్పు) | రు. 0 | 8 |
| లెనిన్ ఉపదేశాలు (రెండో కూర్పు. పామీదత్తు) | 1 | 0 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర (రెండో కూర్పు-ఒకే సంపుటి) | 1 | 4 |
| బలిదాన్ (సోవియట్ నాటకం) | 1 | 0 |
| సోవియట్ ప్రజాస్వామ్యం (రెండో కూర్పు) | 0 | 12 |
| నాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | 1 | 0 |
| లెనిన్ జీవితకథలు (18 బొమ్మలతో-పిల్లలకు) రెండో కూర్పు | 1 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు (పది కథలు) రెండో కూర్పు | 1 | 8 |
| గోర్కీ కథలు (ఆరు కథలు) | 1 | 8 |
| యుక్తిప్రశ్నలు (చిక్కు-ప్రశ్నలు - శాస్త్రీయ సమాధానాలు) | 1 | 8 |
| డిప్యూటీ ఛైర్మన్ (చీనా విప్లవ కథలు) | 1 | 0 |
| ప్రతీకార జ్వాలలు (నవల - రెండో కూర్పు) | 1 | 0 |
| రాజ్యాంగ యంత్రం (లెనిన్ రచన; రెండో కూర్పు) | 0 | 4 |
| ఇండియా (మార్క్సు. ఏంజిల్సు) | 1 | 0 |
| చీనా కథలు (ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్) | 1 | 0 |
| గోర్కీ జీవితం (బొమ్మలతో) | 1 | 8 |
| విజ్ఞాని పావ్‌లోవ్ (జీవితము - నాటకము) | 2 | 8 |
| వానరుడు-నరుడు: పరిణామక్రమంలో కర్మపాత్ర (ఏంజిల్సు) | 0 | 6 |
| వామపక్ష కమ్యూనిజం: బాల్యారిష్టం (లెనిన్) | 2 | 0 |
| దక్షిణ పవనం (స్టాలిన్ ప్రైజు నవల) | 4 | 8 |

★

వలయువారు:— విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.



PRINTED AT AVANTI PRESS, RAJAHMUNDRY


92

